# సృజన

ఆధునిక సాహిత్య వేదిక




**INTELLECTUEL GAUCHISTE**–Sartre (with Simone de Beauvoir in the background) demonstrates his commi ment to action by hawking copies of a Maoist paper

ముఖచిత్రం:

పీపుల్స్‌కాజ్ పత్రిక అమ్ముతున్న సార్త్ర్.

వెనుక సైమన్-డి-బవర్.

పత్రులకు, వివరాలకు:

4/729 కుమార్‌పల్లి
హనుమకొండ
వరంగల్-1 (ఆం. ప్ర.)

సంవత్సర చందా : పది రూపాయలు
అర్ధ సంవత్సర చందా : ఆరురూపాయలు
విడిప్రతి : ఒక రూపాయి

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

'71 డిసెంబర్ | మాసపత్రిక | 27

# లే!

ఆంధ్రప్రదేశ్ పోలీసుశాఖ 'లే'ను కూడ నిషేధించింది. 'లే' విప్లవ రచయితల సంఘం, తిరుపతి శాఖ వాళ్ళు ప్రచురించిన కవితాసంకలనం. ఏనాడో కాపీలన్నీ అయిపోయి ద్వితీయ ముద్రణ గురించి ఆలోచిస్తున్న రోజుల్లో, ఆగస్ట్ 2 న విప్లవ కవులను అరెస్ట్‌చేసి ఆగస్టు 7 న 'లే' ను నిషేధిస్తున్నట్లు ఉత్తర్వులు జారీచేసింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. మన ప్రభుత్వానికి ఒక విషయం ప్రజలందరి దృష్టికితెచ్చే సాధన గెజెట్. పాపం, ఆ గెజెట్ దేశంలోని ప్రజలు విప్లవ సాహిత్యం చదివినంత విరివిగా చదువుతారని భ్రమిస్తారేమో అందులో ప్రకటిస్తారు. అప్పటికే విప్లవ సాహిత్యం తేవలసి నంత 'ద్వేషాన్ని, కసిని అసంతృప్తిని' యీ 'న్యాయబద్ధంగా' ఏర్పడిన ప్రభుత్వంపట్ల తెచ్చి తన ధర్మం తాను నిర్వహిస్తుంది. కనుక యీ నిషేధాల తాటాకు చప్పుళ్ళకు విప్లవ పుస్తకాలు బెదరవు. మరింత కవితావేశంతో, మరింత స్థిరమైన నిశ్చయంతో, సంపూర్ణంగా స్పష్టమైన కమిట్‌మెంట్‌తో మరింత ప్రజాసాహిత్యాన్ని సృష్టించడమే నిషేధాజ్ఞలకు విప్లవ సాహిత్యమిచ్చే జవాబు.

అయితే ప్రభుత్వం కుడికన్ను చూసిన విషయమే ఎడమకన్ను చూడలేనంత అజ్ఞానంలో, ఒక విషయంలోని అనుభవం, ఇంకో విషయంలో గుణపాఠంగా తీసుకోలేనంత అవివేకంలో ఉన్నందుకే యీ నాలుగు మాటలు గుర్తుచేయాలనిపిస్తున్నది.

మావో సూక్తులను నిషేధిస్తూ గుజరాత్ ప్రభుత్వం ఉత్తర్వుచేస్తే గుజరాత్ హైకోర్టు ఆ ఉత్తర్వును కొట్టివేస్తూ యిచ్చిన తీర్పు ఒక్కసారి మన హోంశాఖ దృష్టికి తెస్తే ఇక ముందయినా బుద్ధిగా మసలుకుంటుందేమోనని !

"మన ప్రజలకు ఏ సిద్ధాంతం, ఏ తాత్త్విక ఆలోచనా విధానం మంచిది అనేది నిర్ణయించాల్సింది యీ నాటి ప్రభుత్వంగాదు, యీనాడు కోర్టులలో పీఠాలమీద కూర్చున్న జడ్జీలూకాదు. తమకేది అత్యుత్తమమయిందో ప్రజలే ఎంచుకుంటారు. ఆ ఎంచుకోవడంలో వాళ్ళు వివేకవంతమైన, తెలివయిన నిర్ణయం తీసుకోవడానికి వీలుగా భావాలను స్వచ్ఛందంగా ప్రచారం కానివ్వడం అత్యవసరమైన ఆవశ్యకత". లే, ప్రభుత్వమా, లేచి, నీ కోర్టు చెప్పిన మాటైనా నువ్వు విను.

— సంపాదకుడు

రచయిత- కమిట్‌మెంట్:

## కమిట్‌మెంట్ - మాటకాదు, క్రియాత్మక చర్య.

## ఝా( పాల్ సార్త్రి

Sartre Accuses the Intellectuals of bad faith అనే శీర్షికతో 17అక్టోబర్ 1971 ది న్యూయార్క్ టైమ్స్ మ్యాగజైన్‌లోవచ్చిన ఇంటర్వ్యూ సారాంశం ప్రధానాంశాలేవీ వదలకుండా కింద యిస్తున్నాం.

మేధావులు ఆలోచించవలసిన, చర్చించవలసిన అంశాలు సార్త్రి భావాల్లో చాలవున్నాయి. మన సమాజ- సాహిత్య దృష్టితో వీనిని పరిశీలించవలసిందిగా పాఠకులను కోరుతున్నాం. — సంపాదకుడు

**సార్త్రిను ఇంటర్వ్యూచేసిన జాన్ గెరాసీ ప్రస్తుతం యూరప్‌లో నివసిస్తున్న అమెరికన్ పాత్రికేయుడు. ఇప్పుడాయన సార్త్రి జీవితచరిత్రి రచిస్తున్నాడు.**

సార్త్రి ఫ్రాన్స్‌లోనేకాదు ప్రపంచంలోనే ఉత్తమోత్తమ మేధావిగా పరిగణింపబడుతున్నాడు. ప్రపంచ వ్యాప్తంగా రెండు తరాల రచయితలను ప్రభావితంచేసాడు. తన నిశ్చితమైన రాజకీయ నిబద్ధతతో యుద్ధానంతర సమాజంలో సామాజిక చైతన్యాన్ని జాగృతంచేసాడు.

1956 లో హంగెరీలో రష్యా జోక్యాన్ని ఆయన దండయాత్రిగా భావించాడు. అట్లా బహిరంగంగా ఖండించాడు. అంతదాక ఆయన రాజకీయ కార్యకలాపాలన్నీ ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీతో సంబంధంకలిగి వుండేవి. యుద్ధ వ్యతిరేక, అమెరికా వ్యతిరేక ప్రదర్శనలెన్నింట్లోనో పాల్గొన్నాడు.

ఫ్రెంచ్ వియత్నాం యుద్ధ వ్యతిరేక ఉద్యమంలో ఆయన ప్రముఖపాత్రి వహించాడు. అల్జీరియా యుద్ధకాలంలో ఆయన ఎంత చురుకుగా పనిచేసాడంటే ఫ్రెంచ్ రైట్‌వింగ్ తీవ్రవాదులు ఆయనను ఎన్నోసార్లు చంపాలని ప్రయత్నించాడు. డీగాల్ పాలనకు వ్యతిరేకంగా, అమెరికా వియత్నామ్ యుద్ధానికి వ్యతిరేకంగా అయన రాసాడు. మాట్లాడాడు. ప్రదర్శనలకు నాయకత్వం వహించాడు. వియత్నాంలో దారుణ మారణకాండ నిర్వహిస్తున్న అమెరికాను ఖండించిన అంతర్జాతీయ యుద్ధనేరాల ట్రిబ్యునల్‌కు ఆయన 1966, 67లలో అధ్యక్షుడు

1968 మేలో ఫ్రెంచ్ విద్యార్థులు డీగాల్‌కు వ్యతిరేకంగా లేవనెత్తిన విప్లవజెండాను భుజాలమీద మోసినవాడు సార్త్రి. ఆ తిరుగుబాటులో సార్త్రిను ముఖ్యంగా ఆకర్షించింది సంప్రదాయంగా వస్తున్న విలువలన్నింటినీ యువతరం తిరస్కరించడం. ఆయన వాళ్ళను

సమర్థించాడు. ఫ్రెంచ్‌వాళ్ళేకాదు, తనసుతాను ఆయన 'గాసిస్ట్' అని పిలుచుకున్నాడు. (ఎప్పటికప్పుడు స్పందించే మిలిటెంట్ వామపక్షీయుడు) తీవ్ర వామపంథాను ఏగ్రూప్ అనుసరిస్తే ఆ గ్రూప్‌ను సార్త్రె సమర్థించాడు.

పోలీసులు అణిచేయడానికి ప్రయత్నించిన ఎన్నో వార్తాపత్రికలకు ఆయన సంపాదక బాధ్యతలు స్వీకరించాడు. ప్రజా కోర్టులకు అధ్యక్షత వహించి అధికార అన్యాయాలను బట్టబయలుజేసాడు. విప్లవానికి ఉత్తేజం కలిగించే ఏ నూతన సంస్థనైనా తనపేరు వాడుకోనిచ్చాడు. చివరకు జూన్‌లో అరెస్టయ్యాడు.

సార్త్రె మాంట్‌పార్నేసీలో ఒకే ఒక గదిగల ఇంట్లో చాల మామూలుజీవితం గడుపుతున్నాడు. పుస్తకాలే ఆయన ఆస్తి. ఆయనకువచ్చే ఆదాయమంతా అవసరాల్లోవున్న వామపక్ష రచయితలకు, పోరాడుతున్న గాసిస్ట్ పత్రికలకు యిచ్చివేస్తాడు.

గెరాసీ– ఫ్లాబెర్ట్‌నుగురించి మీ బృహద్రచనలోని మొదటిభాగాన్ని త్వరలో ప్రచురించబోతున్నారు. ఈనాడు మేధావి చేయాల్సినపని రాజకీయాల్లోనేనని యీ మధ్య చాలాసార్లుగా చెబుతున్నారు మీరు. మరి మీరు చేస్తున్న యీపనికీ చెబుతున్న దానికీ వైరుధ్యంలేదా? చేయదగినపని అని మీరనేదాన్ని వివరిస్తారా?

సార్త్– ఫ్లాబెర్ట్‌ని గురించిన నా రచన చాలావరకూ రాజకీయమైనదే. అయినా ఇప్పటి కాలాన్నిబట్టిచూస్తే అది రాయటం నాలోని పెటీ బూర్జువా పలాయనవాదమే కావచ్చు. నేననుకోవటం మేధావి అంతస్తు మారిందని. ఇప్పుడతను ప్రజలతోకలిసి వారిలోవుండే వ్రాయాలి. అందుకోసం తనకున్న సాంకేతికవిజ్ఞానాన్ని వారి స్వాయత్తంచేయాలి. అతని ఉన్నత అంతస్తు పోయింది. ఇవాళ తన సమస్యల గురించే ఆలోచించటం నమ్మకద్రోహమూ విప్లవ వ్యతిరేకమున్నూ. అతను ప్రజలవల్లనే మేధావిగా వున్నాడు; వారినుంచేవచ్చాడు అతని విజ్ఞానం ప్రజలకు ఋణపడివున్నదే. అందువల్ల వారిలో, వారితోనే వుండాలి. తన సమస్యలకుకాక వారి సమస్యలకొరకే అంకితంకావాలి.

నావిషయం. వివిధ కార్యకలాపాల్లో నేను పాల్గొన్నాను. ఉదా– 'లెన్స్' ప్రజాన్యాయస్థానంలో పనిచేశాను. (తిరుగుబాటు కార్మికులపై చాలా నేరారోపణలుచేసి ప్రభుత్వ కోర్టు విచారణజరిపిన ప్రదేశం లెన్స్) ప్రజాన్యాయవాదం తరపున నా శక్తిని వినియోగించాను. రెనిస్–లీటార్ట్ గనియజమానులే ఎలా నిజమైన దోషులో నిరూపించే తీర్పురాసాను.

నేను రాసాను. కాని నేను అగవి కార్మికులవాణినిమాత్రమే. 'జె,ఎక్యూజ్' లాంటి విప్లవపత్రికలకు వ్యాసాలు రాస్తున్నాను. ఆయా పత్రికల సిద్ధాంతాలతో

నాకు ఏకీభావం లేకపోయినా రాస్తున్నాను. ఎందుకు? అలాంటి పేపర్లకు మొదట్లో స్టార్ వేల్యూగా పనికొస్తాను. సైమన్-డి-బివర్ కూడా అలా గే చేస్తోంది. కాని నా లక్ష్యం యీ విడి విడి పత్రికల పద్ధతి అంతరించి సమిష్టిగా నిర్వహించబడే పత్రికా పద్ధతి రావాలని, పోరాటాలు చేసే ప్రజలే పత్రికలు నడపటం జరగాలి. టెక్నికల్‌గా సహాయపడటం, అన్నీ సమకూర్చటం; ప్రచురించటంవరకే సంపాదకుల సమిష్టిపనిగా వుండాలి. ఒక కర్మాగారాన్ని కార్మికులు వశంచేసుకొన్నప్పుడల్లా ఆ పనిని ఎలా, ఎందుకుచేసారో, ఏ అనుభూతులు పొందారో, ఏంపాఠాలు నేర్చుకున్నారో ఆ కార్మికులే రాసేట్టుచూడటం మాత్రమే మన పని కావాలి. ఆలా రాయటంలో సహాయ పడటమే మనం చేయాల్సిందిగా వుండాలి అంతేగాని, వ్యాఖ్యానాలు చేయటమో, వారు ఏమి చెప్పాలో తెలియచేయటమో కాదు మనం చేయాల్సింది. స్వయం నిర్ణయం అనేది బ్యాలెట్ పెట్టె సూత్రంకాదు. అది ప్రజల అధికారానికి దారితీసే రాజకీయచర్య.

గెరాసీ- కమ్యూనిష్టుపార్టీ కార్మిక వునాదిపైనే నిలచి, మేధావులను తనలో ఎపుడూ కలుపుకుంటూనే వుంటోంది. ఆ పార్టీకీ, యీ మీరు చెప్పిందానికీ మౌలికంగా భేదంఏముంది?

సార్త్- కమ్యూనిష్టు పార్టీ మేధావులను ప్రజల్నించి ఎపుడూ దూరంగానే వుంచింది. దానిప్రధాన కార్యవిధానం-సెల్.సెల్స్ రెండురకాలుంటయ్, పనికేంద్రాలలోని సెల్సు, ప్రాంతాలవారీ సెల్సు. ఫాక్టరీ వగైరాలలో వుండరుగాబట్టి మేధావులు పనికేంద్రాలసెల్సులో వుండరు కార్మికప్రాంతాలలో సామాన్యంగా నివసించరు కాబట్టి ప్రాంతాలసెల్సులోనూ కార్మికులతో వుండరు, వేరేగానే వుంటారు, ప్రజానీకానికి దూరంగా గతంలో 1848, 71లలో మేధావులు ప్రజలతో శ్రామికులతో మిళితమయారు అందుకే శ్రామికుల తరపున మాట్లాడే అర్హతపొందారు, కమ్యూనిష్టుపార్టీ యిందుకుఎపుడూ వ్యతిరేకమే. అలాటిసమైక్యత ఏర్పడిననాడు మేధావితన బూర్జువాతనాన్ని పోగొట్టుకుంటాడు. కమ్యూనిష్టుపార్టీ వారినివేరుగానే వుంచింది. కార్మికులు మేధావులు కలిసిపోవటం సాధ్యమని నేనిపుడు పూర్తిగా నమ్ముతున్నాను. మామూలుప్రజలూ, మేధావులూ వాడేభాషలో తేడాలువగైరా కొన్నియిబ్బందులున్నా కలసివుండటం సాధ్యమే.

గెరాసీ- జీవనసరళిలో కూడా భేదం వుందికదా?

సార్త్- అవును. కాని ఆవిషయంగా ప్రజలునిన్నేమీతప్పుపట్టరు. నేను నావిషయంలోనే యీసంగతి చాలాసార్లు గమనించాను, కార్యక్రమాల్లో శ్రామికులతో

కలసిపనిచేయటం ముఖ్యం. నాజీవనవిధానం వేరుగా వారికంటే మెరుగుగా వున్నదనేది సమస్యకాదు. భాష యింకాఎక్కువ సీరియస్ సమస్య. శ్రామికులకు అర్థంకాని చాలాపదాలు మేధావులు సర్వసాధారణమైనవిగా వాడేస్తుంటారు.

ఒకతత్త్వవేత్త ఒకసంగతిని యింకోతత్త్వవేత్తకు వివరించటం తేలిక, పిల్లలకు వివరించటం కష్టం, ఎందుకని, పిల్లలుతమకున్న అమాయకత్వంవల్ల, నిజమైన అసలు ప్రశ్నలడుగుతారు. కార్మికులూఅంతే. శ్రామికులకందటంకోసం మనం అందుకు తగినభాష ఉపయోగించాలి. మనం పైనవున్నట్లు, వాళ్ళుతెలియని వాళ్ళన్నట్లు మాట్లాడంకాదు, అదిఎప్పుడూ విఫలంఅవుతుంది. నిజాయితీవున్న భాషను, గతంలోని భావాలతో కూర్చబడని సజీవమైనభాషను మనంవాడాలి. మాటలకుండే మహత్తును వదలగొట్టాలి. రౌజ్ (ట్రాట్స్కీయిష్టు 4వ ఇంటర్ నేషనల్ వారి పారిస్ పత్రిక) చూస్తేనేవనేది అర్థం అవుతుంది, ఆ పత్రికలో మార్క్సిష్టు సిద్ధాంతభావాలు, గతంనుంచి వల్లించబడుతున్న పదజాలం, చాలా మాటలు ఆపార్టీలో వుండేవాళ్ళకు మాత్రమే అర్థమవుతాయి, మామూలువాడు చదవనేలేడు.

ప్రతివాడూ అర్థంచేసుకోగల్గేట్టు, అవుసరమైన రాజకీయ వాస్తవాలను వివరించగల భాష కావాలి.

గెరాసీ— ఎంత సులభంగా రాయాలన్నా, అసలు అలాంటి పత్రికలను ప్రజలు చదువుతున్నారా అని? 'జె, ఎక్యూజ్'నుగాని ఇంగ్లండ్, అమెరికాల్లోని అతివాద పత్రికలనుగాని శ్రామికులు చదవటంలేదని నా కనిపిస్తుంది.

సార్త్ర్— అందుకు ఒకే ఒక పరిష్కారం. మిలిటెంట్ పంపకం. ఆశయానికి కట్టుబడిన పత్రిక ఆ నిబద్ధత వస్తువు విషయంలోనే కాక పంపకం సందర్భంగానూ చూపాలి. పేపరు స్టాల్స్‌లో పెట్టేయటం, చందాదార్లకై విజ్ఞప్తులు చేయటం కాదు. ఫ్యాక్టరీల్లోకి శ్రామిక నివాస ప్రాంతాల్లోకి గూడెములలోకి మిలిటెంట్స్ (విప్లవ కార్యకర్తలు) వెళ్ళి వ్యక్తిగతంగా శ్రామికుల్ని కలుసుకొని అమ్మాలి. ఫ్రాన్స్‌లో యీ పనిని 'పీపుల్స్‌కాజ్' 'జె, ఎక్యూజ్' పత్రికలు చేస్తున్నవి. కార్యకర్తలు వెళ్ళి అమ్మటమూ పేపర్లు పంచటమే కాక శ్రామికులతో మాట్లాడాలి, గ్రెనోబుల్ కర్మాగారాన్ని కార్మికులు వశం చేసుకోవటం గురించి పత్రికలో వుందనుకోండి, అపుడు పత్రికలు పంచే కార్యకర్తలు బిలాన్ కోర్టులోని రెనాల్ట్ ఫ్యాక్టరీవద్ద కార్మికులతో పేపరు చదివించాలి. దానిమీద అభిప్రాయం చెప్పమనాలి, వీలుంటే ఆ కార్మికుని మాటలను టేప్‌రికార్డు చేసుకోవాలి, ఆతని

వుద్దేశాలను వ్రాయమని, పేపర్లో వేస్తాం అని అడగాలి. అలాటి ఆ కార్మికుని మాటలను తర్వాతి సంచికలో ప్రచురించాలి. ఆ విధంగా మొదట మేధావి అయి మిలిటెంటు అయిన యీ పేపరు పంపకందారు, బిలాన్ కోర్టులోని కార్మికులకూ గ్రెనోబుల్ కార్మికులకూ మధ్య సంధానకర్త, మధ్యవర్తి అవుతున్నాడు.

గెరాసీ- కార్మికులకు వర్గచైతన్యమూ రాజకీయ విజ్ఞానమూవున్నయ్, కావున ఫ్రాన్స్‌లో యిలా సాధ్యంకావచ్చు. కాని అమెరికాలో కార్మికులు అలా లేరు. చాలా మంది కార్మిక సంఘాలవాళ్ళే మనకు వ్యతిరేకంగా వున్నారు. అక్కడ యీ విధానం సరైనదవుతుందా?

సార్త్ర్- పద్ధతి ఎక్కడా అలాగే వుండాలని నా వుద్దేశం. కాకపోతే ఎదుర్కోవాల్సిన కష్టాల్లో ఎక్కువతక్కువలుండొచ్చు. అమెరికాలో యిలా పేపర్లుపంచే కార్య కర్తలు దెబ్బలుతినవచ్చు. అది యిక్కడా జరుగుతుంది. మావాళ్లు యిక్కడ చాలాసార్లు సి.జి.టి. (కమ్యూనిస్టుల కార్మిక సంఘం)గుండాలబాధలకు గురవుతున్నారు. అందువల్లకూడా అలాటి పనులు నాకు విధిగా చేయాల్సినవి అవుతున్నయ్. కార్మికులలో అలాంటి సమయాల్లో మెలగటానికి నాకు ఒక సాధారణ విద్యార్థికంటే అవకాశం ఎక్కువ వుంటుంది.

గెరాసీ- పెద్ద పేరుగల మేధావులు అమెరికాలోనూ యిలాగే చేయాలని మీవుద్దేశమా?

సార్త్ర్- ఖచ్చితంగా. వియత్‌నామ్‌లో యుద్ధాన్ని విరమించమని సంతకాలు చేయటం, వేలాది కామ్రేడ్స్‌తోకలసి ప్రదర్శనల్లోపాల్గొనటం చాలా తేలికపని. పేరుగల మేధావులు, కూలీ గూడేలలోకీ, ఓడరేవులకూ, యుద్ధపరికరాల ఫ్యాక్టరీలకూ వెళ్ళి యూనియన్ పెత్తందార్ల దౌర్జన్యాలకు తెగించి పనిచేయగల్గితే జరిగే ప్రయోజనంలో యీ సంతకాలూ ఊరేగింపులవల్ల లక్షోవంతుకూడా వుండదు.

అతనేమిరాసినా, కలంతో మాత్రమే తనపోరాటం అంతా నడిపే మేధావి, విప్లవ ప్రతిఘాతకుడే.

గెరాసీ- ఈ పద్ధతిని మీ శారీరక ప్రమాదానికి మీరు తెగించగలరా?

సార్త్ర్- ఆ! అలాచేశానుకూడా, రెనాల్ట్‌లో, లెన్స్‌లో, పారిస్ బజార్లలో నాకున్న పేరు ప్రతిష్ఠలు నన్నెంతో కొంత రక్షిస్తున్నయ్యని నాకుతెలుసు. మీదేశంలోని ప్రఖ్యాత మేధావులసంగతయినా యిలాగే వుంటుంది. మనం ఎక్కడకువెళ్లినా, ఎక్కడ నేను కనిపించినా వ్యతిరేకులు కొందరుంటారు, అనుకూలురు కొంద

రుంటారు. ఎక్కువ మంది తటస్థులుగా, ప్రేక్షకులుగా కొంత వింతజూచే వాళ్లగానూ వుంటారు. వాళ్ళతోటే మనం మాట్లాడాల్సింది. ఈమూడుశక్తుల, సంఖ్యా, శక్తి బలాబలాల సంబంధాన్నిబట్టి ప్రమాదంలో ఎక్కువ తక్కువ లుంటయ్. మనం ఆ పరిస్థితులకు నిలవాలి. వన్ను కొట్టారనుకోండి. అలా కూడా కొంత రాజకీయ ఉపయోగంకావచ్చు. కాదంటారా?

గెరాసీ— మీలాంటి పేరుగల మేధావులకు మామూలు పత్రికల్లో అవకాశాలుంటయ్. అవి జనబాహుళ్యం చదువుతారు. వాటినెందుకు ఉపయోగించుకోకూడదు?

సార్త్— జాగ్రత్తగా ఆలోచించండి. విజ్ఞానంకోసమూ, సంగతులు తెల్సుకోవటంకోస మూ చదవరు ప్రజలా పత్రికల్ని. వినోదానికీ, కాలక్షేపానికే చదువుతారు. ఇక్కడ 'లా అరోర్'అయినా మీ డెయ్‌లీన్యూస్ అయినా అందుకేచదువుతారు. అతివాద పత్రికల్లోని భావాలను అంగీకరించినా, అంగీకరించకున్నా వాట్నిచది వితేమాత్రం విషయంకోసమే చదువుతారుగాని వినోదంకోసం కాదు.

పత్రికాస్వేచ్ఛ అనేది బూర్జువాభావం. ప్రజానీకానికి ఆ సమస్యే మీపట్టదు. పత్రికా సెన్సార్‌గురించి కార్మికులు నిరసన ప్రదర్శనాలు చేయటం యెక్కడా జరగదు. ప్రజలకు సహజంగానేతెలుసు యీ పత్రికలు బూర్జువాలవనీ ప్రజ లవికావనీ, పత్రికాస్వేచ్ఛ అంటే పెట్టుబడిదారీ పత్రికాస్వేచ్ఛ. అంటే తెలి యకండానే ప్రజలు యీ పత్రికల్ని శత్రువులుగానే చూస్తారు. అందుకే తమ నిజజీవితాలకు సంబంధించి యీ పత్రికల్నిం. ఏమీ ఆశించరు జకొస్లవేకియా లో యిది నిజంకాదు. అక్కడ కార్మికులూ విద్యార్థులూ తమకు తమవిగానే వార్తలందించే పత్రికలను పోషలిస్టు పత్రికలను కలసికట్టుగా డిమాండ్‌చేసారు.

పెట్టుబడిదారీ దేశాల్లో మామూలు పత్రికలు ఏమీ ఉపయోగకరంకావు మరి వాటికి రాయటం ఎందుకు? స్వతంత్ర వామ పక్ష పత్రికలు ప్రజానీకంలోకి పోవు. అతివాద బూర్జువాలే వాట్ని చదువుతారు. మిలిటెంట్ పత్రికలకే నేను రాస్తాను. వాటి సిద్ధాంత భావాలతో పూర్తిగా ఏకీభవించక పోయినా, హోటళ్ళ ముందు, పేపర్‌స్టాల్స్‌లోనూ పెట్టక ప్రజలవద్దకు మిలిటెంట్‌గా కదలివెళ్ళి పత్రికను అందించుతూ యీ విషవలయాన్ని బద్దలుకొట్టేవాళ్ళ పత్రికలకే నేను రాస్తాను.

గెరాసీ— ఇవి మేధావులేగాక సాధారణ ప్రజలూ చదువుతున్నారని మీరనుకుంటున్నారు?

సార్త్— అవును. కాని వీట్ని యింకా సరైన పద్ధతుల్లోకి తేవాలి. అదీగాక, యివి

సంఖ్యలో అనవసరంగా ఎక్కువ వున్నయ్, ప్రతి చిన్న గ్రూపుకూ ఒకటి చొప్పున.

గెరాసీ— అతివాదుల్లో వేర్పాటు ధోరణీ, ఒంటెత్తు తనమూ సంగతి అది?

సార్త్— అవును. ఎపుడయినా అతివాదం మొదట్లో ఒంటెత్తు పోకడే. అయినా యిక్కడ ఫ్రాన్స్‌లో కొంత అభివృద్ధి కనిపిస్తోంది. ట్రాట్స్కీస్టులు, మావో యిష్టులూ కలసి తగినంతకాలం పనిచేయగరని నేననుకోను. కాని సెకోర్స్ రౌజ్ (ఒక అతివాద సంస్థ) 20 మంది వ్యక్తులతో ఆరంభమయి చాలా ముఖ్యమైన మార్పులకు లోనవుతున్నది. ఆ వ్యక్తులు ఒకొక్కరూ బయటకు వెళ్తున్నారు. (ఉదా- నేను దాని డైరెక్టర్‌గా రాజీనామా చేశాను.) బదులుగా పునాది వర్గాలనుండి మిలిటెంట్స్ ఆ స్థానాలు తీసుకుంటున్నారు. అందులో స్వతంత్రులయిన ట్రాట్స్కీష్టులూ (ప్రిముఖలే) మావోయిష్టులూ బాగానే కలసి పని చేస్తున్నారు: దాని ప్రాంతీయశాఖలు కార్మికులనూ మేధావులనూ శక్తివంతంగానే కలపి తీసుకొస్తున్నయ్. విద్యార్థులు చేరినపుడు పోట్లాటలు బయలుదేరే మాట నిజం, కాని మొత్తంమీద సెకార్స్‌రౌజ్ మిలిటెంట్ అతివాదుల ఐక్య సంఘటనగా అభివృద్ధి అవుతోంది. మొన్నటి 'మే' డే' కి పారిస్‌లో వీరు 30000 మంది ప్రజలను ప్రదర్శనలోకి సమీకరించగలిగారు. కమ్యూనిష్టుపార్టీ ఊరేగింపుకు 70,000 మందే వచ్చారు. ఇది శక్తుల సంబంధాలలో చెప్పుకోదగిన మార్పు.

గెరాసీ— గతమూడుదశాబ్దాలలో ఉద్యమము, వ్యక్తిగతంగా మీరుపొందిన ఓటమిల దృష్ట్యాకూడా మీరెలా ఆశావాదిగా వుండగల్గుతున్నారు,

సార్త్— మేధావి కర్తవ్యం ఏమని నేననుకుంటున్నానో, అదిచేస్తున్నాను. దానర్థం నేను ఆశావాదినికాదు. నేను యీవ్యవస్థాచట్రంలో వున్నాను. ఉండకతప్పని పరిస్థితి కాని విప్లవం నెరవేరాలని అనుకుంటున్నాను. ఇదినేనుగా ఎంచుకొన్నది. మరి విప్లవంజయిస్తే అప్పుడుఏమిటి? అపుడు మానవుల్లో పరపీడన, ఏకాకిననే అసంతృప్తి, మనఅనుకునే యీనిరాశలు పోయిఉత్క్రమవుతుందా, నేనంతనిశ్చయంగా ఏమీలేను. నేనుఆశించేది భయోత్పాతంలేకుండా విప్లవం తీసుకరాగల్గితే అప్పుడుమనం ఉన్నదున్నట్లు చూడగల్గుతాం, అర్థంచేసుకుంటాం. మనం యివ్వాళ పొరబాటున మనవిఅనుకునే మెషిన్లుమనపైరుద్దిన భావాలను. ఘోరమైన గతాన్నిఅర్థం చేసుకొంటాం. మానవులం కలిసికట్టుగా సమస్యలను ఎదుర్కొంటాం.

గెరాసీ— భయోత్పాతంలేని విప్లవం ఊహించదగిందా, పగసాధింపు, ప్రళయమూ లేకుండా విజయవంతమయే విప్లవాన్ని ఆశించవచ్చా? ఇవాళఅధికారంలోవున్న వాళ్ళ, కుటిలత, క్రూరత్వం దారుణాలను రేపు విజయుమయేలశక్తులు మర్చిపోగలవా? జార్జి జాక్సన్ దుష్టగార్డులను క్షమించాలని ఆశించగలమా?

సార్త్ర్— లేదు. కాని అది అంతచెడుకాకపోవచ్చు. విప్లవకారులు, తమనితాము ఒకర్నొకరు తుడిచేసుకొనే కంటే దోషులను ఏరివేయటమే మంచిది. దురదృష్టవశాత్తూ గతంలోఎప్పుడూజయించినవారు ఆగిపోవటంగురించి ఆలోచించారు. ఎలాఎక్కడ ఆగిపోవాలో విప్లవకారులెప్పుడూ తెలుసుకోలేదని చరిత్రకారులు చెప్పుతారు. కానిజరిగింది పూర్తి విరుద్ధం, విప్లవకారులు ఎపుడుఅగిపోతూనే వున్నారు, తర్వాత వచ్చినతరం మళ్లీపాతతరం ఆగిపోయిందగ్గర్నుంచీ ముందుకు పోవాల్సి వస్తున్నది. 1789-94 మధ్య ఫ్రెంచివిప్లవకాలంలో యిదినాలుగుసార్లు జరిగింది. జరగాల్సిందంతా జరిపేందుకు తయారయి ముందుకుపోయే విప్లవోద్యమం అవసరం.

అంటేఅర్థం. స్కూళ్ళలో పత్రికల్లో, యిళ్ళలో నేర్పబడే బూర్జువావిలువలన్నిటినీ తోసేయగల్గటం, ఇవాళ్టి అతివాదులందర్లోకీ యిలాచేయటానికి ఎక్కువ సిద్ధపడేది పిడివాదంలేని మావో యిష్టులేననుకుంటాను. అంటే బూర్జువా చరిత్రకారులు అసాధ్యం అనిఅంటుండే, భయోత్పాతం కల్గించని నిజమైనసమూలమైన విప్లవాన్ని వాళ్ళేఎక్కువగా అర్థంచేసుకున్నారు.

గెరాసీ— అందుకేనా మీరు కమ్యూనిష్టు పార్టీతో కలిసిపనిచేయటానికి యిపుడేమీ ఒప్పుకోవటంలేదు? మీరుఒకప్పుడు కలిసిపనిచేసారు, ఎలాగయినా యివాళ్టికీఫ్రాన్స్‌లో అది జనబాహుళ్యంగల పార్టీయే కదా!

సార్త్ర్— నిజాయితీగల ఫాసిస్టు వ్యతిరేకులందరూ చేసినట్లు నేనూ జర్మనీఆక్రమణ వ్యతిరేక పోరాటంలో కమ్యూనిష్టులతోకలసి పనిచేసాను. విముక్తి తర్వాత వాళ్ళ అవకాశవాద ఎత్తుగడలమూలంగా నేను కలసి వుండటం అసాధ్యం అయింది. వాళ్ళ పత్రికల్లో నన్ను శత్రువుగా చిత్రించారుకూడా. 1950 ల మొదట్లో ఫ్రాన్స్‌పై అమెరికా ఆధిపత్యం పెరిగిపోవటం. ఉత్తర అట్లాంటిక్‌కూటమి. జేక్స్ డగ్లాస్ (ఫ్రెంచి కమ్యూనిష్టు నాయకుడు) అరెస్టు సందర్భాలుగా వారితో కలిసేందుకు నిర్ణయించుకున్నాను. వారు వియత్నాం యుద్ధ (అది అపుడు మాయుద్ధం. అంటే ఫ్రాన్స్) వ్యతిరేకతకునాయకత్వం వహించారు. ఫ్రెంచి కమ్యూనిష్టు నావికాదళానికిచెందిన హెన్రీ మార్టిన్‌ను దేశద్రోహ నేరంక్రింద

విచారణ చేసినప్పుడు నేను అతనితరఫున బాగా ప్రచారంచేశాను. వియన్నా శాంతి మహాసభకుకూడా వెళ్ళాను. తర్వాత రష్యా హంగెరీమీద దాడిచేసింది. ఇది నాకు ఘోరంఅనిపించింది. అంతకముందు రష్యాలోపల ఘోర నేరాలు జరిగాయి. వాటినే యిపుడు స్టాలినిజం అంటున్నారు. దేశంలో ఎన్ని అన్యాయాలుజరిగినా బయటకు యితర దేశాలమీదకు ఒక ఆంతరంగిక ప్రజాతిరుగుబాటును అణచేందుకు రష్యాసైన్యం అంతకుముందెప్పుడూ కాలు బయటకుపెట్టలేదు. ఇది నాదృష్టిలో స్పష్టమైన సామ్రాజ్యవాదం. 1968 లో ప్రేగ్‌మీద దండయాత్రా అంతే. ఫ్రెంచికమ్యూనిష్టుపార్టీ హంగెరీపై రష్యా దండయాత్రను సమర్థించింది. అందుకని నేను ఆపార్టీతో తెగతెంపులు చేసుకున్నాను.

అల్జీరియా యుద్ధమపుడు ఫ్రెంచి కమ్యూనిష్టు పార్టీ అల్జీరియా విముక్తి సంఘాన్ని బలపర్చటంలో అంతంతమాత్రంగానే వుంది. అల్జీరియా విముక్తి సంస్థ కమ్యూనిష్టు సంఘం కాదుగనక. అప్పుడు అతివాదశక్తులన్నీ ఐక్యంగా ఫ్రెంచి వలసాధిపత్య వ్యతిరేక ప్రదర్శనలు నిర్వహించినయ్. ఆ రోజుల్లోనే స్పష్టమయింది- కమ్యూనిష్టుపార్టీకంటే తీవ్రవాదమైన ఉద్యమాన్ని సృష్టించాల్సిన అవసరంవుందని.వియత్నాంయుద్ధం(ఇపుడు'మే')తో ఆ తీవ్రవాదఉద్యమ ఆవిర్భావం జరిగింది. అందులో నేనూ భాగస్వామిని. నేనప్పటికింకా మేధావి అనే పదానికి ప్రతీకగా వున్నాను. ఎంతచేసినా నాకలంతోచే పనిచేశాను. ఎపుడేనా ఒకసారి ఊరేగింపులో పాల్గొనటమో, ఒకో మీటింగ్‌లో మాట్లాడటమో మాత్రమే జరిగింది.

అప్పుడు, సరిగా అప్పుడు 1968 'మే' వచ్చింది. యువతరం నిలవేసి ప్రశ్నిస్తున్నది— పెట్టుబడిదారీ విధానాన్నీ, సామ్రాజ్యవాదాన్నీ యీ వ్యవస్థనే కాదు, వీటన్నిటికీ వ్యతిరేకమని చెప్పుకుంటున్న మమ్మల్నికూడా— అని అర్థం చేసుకున్నాను. 1940 నుంచి 68 వరకు నేను అతివాద పక్షం వహించిన మేధావిని. '68 నించీ అతివాద మేధావినయ్యాను. ఈ రెంటికీ భేదం కార్యాచరణలోనే. మేధావిగా వుండటం అనేది దేన్నించీ అయినా తప్పించుకోవటానికి అవకాశంకాదు అనేది అతివాద మేధావి గుర్తించుతాడు. అతనికున్న అవకాశాలను, అందరకూ లేని సదుపాయాలను, అతివాద మేధావి విసర్జించుతాడు. కనీసం కార్యాచరణ ద్వారా విసర్జించే ప్రయత్నం చేస్తాడు. మీ అమెరికాలో తెల్లవాళ్ళకున్న సౌకర్యాలలాంటివే యిక్కడ నేననే మేధావుల సౌకర్యాలు. అమెరికాలో అతివాదియైన తెల్ల మేధావికున్న అదనపు సౌకర్యాలను తనుగా తను ప్రత్యేక చర్య ద్వారా నాశనం చేయాలి. అలా చేయకపోవటం వల్ల

వాళ్ళను హత్యచేయటంలాంటి నేరమే. బాబీ హట్టన్, ఫ్రెడ్‌హామ్‌ప్టన్, మార్క్‌క్లార్క్ మొదలయిన బ్లాక్ పాంథర్స్‌పై పోలీసులు, మీ వ్యవస్థ తుపాకులు కాల్చటం లాంటిదే.

గెరాసీ– అయితే మీరు చెప్పేది మేధావి బాధ్యత మేధస్సంబంధమైనది కాదనా?

సార్త్రె– ఔను, ఆ బాధ్యత కార్యాచరణలో వుండాల్సిందే. తనకున్న అంతస్తును పీడితుల సేవకై నేరుగా అర్పించాల్సిందే, జర్మనీలో ఆనాడు హిట్లర్‌కు జడిసి పారిపోయి వచ్చి నాజీజాన్ని గురించి నిరసనగా ఎంత లెక్చర్లిచ్చినా హాలీవుడ్ సినిమాలకు స్క్రిప్టులు రాసి డబ్బు సంపాదించిన జర్మన్ మేధావి, జర్మనీలో వుండి హిట్లర్ ఘాతుకాలను సాగనిచ్చిన వాళ్ళతోపాటు హిట్లర్‌ని నిలబెట్టిన వాళ్ళలో లెక్కే. అట్లనే వీట్నాం యుద్ధాన్ని నిరసిస్తూ, రాజకీయ ఖైదీల దురవస్థకు విలపిస్తూ కూడా యుద్ధ పరిశోధనలు సాగించే యూనివర్శిటీల్లో టీచర్లుగా పని చేసే అమెరికా మేధావులు కూడా ప్రభుత్వంపలెనే యీ హత్యాకాండకు బాధ్యులే. అట్లనే ఫ్రాన్స్‌లోకూడా యీ వ్యవస్థకు వ్యతిరేకంగా తన పూర్తి శారీరక మానసిక శక్తులను వినియోగించని మేధావి మౌలికంగా వ్యవస్థను బలపరుస్తున్న వాళ్ళలో లెక్కే.

గెరాసీ– ఆశయానికి కట్టుబడిన మేధావి చేయాల్సింది నిర్దిష్టంగా ఏమిటి?

సార్త్రె– అమెరికాలో సంగతి చెప్పటంనాపనికాదు, మీమేధావులు తమకుతామే తెల్సుకుంటారు. ఎరికాహాగిన్స్, బాబీసీల్‌లు అరెస్టవుతున్నారన్నా వాళ్ళను చంపేస్తున్నారన్నా పోలీసూ గవర్నమెంటూ కోర్టులే కారణంకాదని మీమేధావులు తెలుసుకోవాలి వారుఅలా జరగనిస్తున్నారూ అంటే వారూ సంజాయిషీ చెప్పుకోవాల్సినవారే. రాజకీయఖైదీలను బయటకుతెచ్చే ప్రయత్నాలుచేసేవాళ్ళకు అహింసను బోధించే వేలాది మేధావుల్లో ప్రతివారూ ఖైదీలు విడుదలకాక పోవటానికి కారకులే.

ఇక్కడి సంగతులు నాకుబాగాతెల్సుకాబట్టి స్పష్టంగా నిర్దిష్టంగా ఫ్రాన్స్‌ని గురించి మాట్లాడగలను. ఇక్కడ రాజకీయఖైదీల విచారణలు జరిగేప్పుడల్లా బజార్లలోకి వెళ్ళటం, ప్రజాకోర్టులు ప్రారంభించటం, అసలు నేరస్తులను ఎత్తి చూపటం మాపని. యువకులకు పోలీసులకు ఘర్షణఏర్పడినపుడు పోలీసులదే ఎలాదౌర్జన్యమో నిరూపించటం మాత్రమేకాదు మాపని, యువకులతో భుజం భుజంకలిపి ప్రతిహింసలో పాల్గొంటాం. రాజకీయఖైదీలు నిరహారవ్రతంచేస్తే శారీరకంగా వీలున్న అందరమూ బయటకూడా నిరహారంవుంటాం.

ఇలాఅయితే జరిగేదేమంటే- ఇదేతన జైలు జాబుల్లో జార్జ్ జాక్సన్ చక్కగా వెల్లడించాడు-రెండేరకాల ప్రజలున్నారనీ ఒకరు నిర్దోషులూ. రెండవ రకం దోషులూ అనేది. మేధావితనకున్న ప్రత్యేక స్థానాన్నిబట్టి అందరికంటె ఎక్కువగా స్పష్టంగా అర్థంచేసుకుంటాడు. మీ బ్లాక్‌పాంథర్స్ చెప్పినట్లు "మనం పరిష్కారంలో భాగంకాకపోతే సమస్యలోభాగంగానే వుంటాం"

గెరాసీ– ఈ వ్యవస్థ హింసకు వ్యతిరేకంగా విప్లవ ప్రతిహింసను బహిరంగంగా బలపర్చుతారా?

సార్త్ర్– పూర్తిగా, కాని 66 ఏళ్ళ యీవయసులో అంతగా పాల్గొనలేను, రహస్యం కానటువంటి ముఖ్యమైన యాక్షన్ఏది జరిగినా నేనూ అందులోచేరాలి. నారచనల్లో రహస్యచర్యలను కూడాబలపర్చాలి.

గెరాసీ– మరి ఫ్రాన్సులోని యీఅతివాద గ్రూపులు అతిచిన్నవని అనుకుంటున్నారా?

సార్త్ర్– అవును అతిచిన్నవే

గెరాసీ– ప్రతిహింస ఉపయోగించేవారు విప్లవం తీసుకురాగలరా?

సార్త్ర్– వారు విప్లవపరిస్థితుల ఫలితంగావచ్చినవారే. అతిత్వరలోవిప్లవం వచ్చేస్తుందని కాదు. ఇవాళఅధికారఫ్రాన్స్‌కూ (అంటే ప్రభుత్వం, సంస్థలు వగైరా) సత్యానికీ మధ్యనిజమైన విభజనవచ్చింది. అధికారశక్తిని ప్రతిహింసతో తిరస్కరించటం ఆరంభమైంది. చిన్నషాప్‌కీపర్లు, ట్రక్‌డ్రైవర్లు, రైతులు, విద్యార్థులు, కర్మాగార ములను వశంచేసుకునే కార్మికులు– అధికారాన్ని సమూలంగా తిరస్కరించే బీజాలు మొలకెత్తినయ్. ఇదంతా యిప్పుడుతెలిసి చైతన్యంతో జరుగుతుండక పోవచ్చు. ఎందుకంటే వీరేలంక్షన్ సమయం వచ్చేప్పటికి అధికార ఫ్రాన్స్‌కు ఓటువేసి పోతారు. కానితమ ప్రయోజనాలకు ప్రమాదం వచ్చినపుడల్లా తెల్సు కుంటూనేవున్నారు. ప్రతిహింసతోనేతప్ప ఏసరయిన మార్పు జరగదని. ఈచిన్నచిన్న గ్రూపులే యీసంగతిని తెలుసు కుంటున్నాయి. అందుకేవారు పురోగాములు. వారుఅలా నడుస్తున్నకొద్దీ చైతన్యం పెరుగుతూనే వుంటుంది. సమాజంలోని విభజన యింకా స్పష్టపడుతూనే వుంటుంది. రెండుపక్షాలూ స్పష్టంగాతేలి పోయినపుడు విప్లవం అనివార్యం.

గెరాసీ– అయితేమీరు అమెరికాలోని వెదర్‌మెన్ ఎత్తుగడలను ఒప్పుకుంటారా?

సార్త్ర్– ఇక్కడి మావోయిష్టులు, కొంచెం తక్కువ హింసాపరులు, వారుయిపుడు విప్లవపార్టీకి పునాదులు వేయటానికికాక ప్రజల్ని సమీకరించే పరిస్థితులను

సృష్టించటానికి ప్రయత్నిస్తున్నారు. ప్రజాసమీకరణలనించే అలాంటిపార్టీ రూపొందుతుంది. కాని పరిస్థితులు ఒకేరకంగా లేవు. ఇక్కడ తరచు విజయం పొందుతున్నాం. నిరహారవ్రతం విజయంపొందింది. లెన్స్ప్రజాకోర్టులతర్వాత అరెస్టయిన గనికార్మికులను విడుదలచేశారు. నాటోటి పేరుగల మేధావులనరెస్టు చేసే పరిస్థితిసృష్టించాక 'పీపుల్స్ కాజ్' పత్రికను నిషేధించే ప్రయత్నం విర మించారు. అమెరికాలో నిర్బంధవిధానం మరీ దుష్టంగా వుంది. వాళ్ళు చంపేస్తున్నారు. మీరయినా పేరుగల మేధావులను చురుకుగా కదల్చగలిగితే విజయాలు పొందొచ్చు. యుద్ధవ్యతిరేక ప్రొఫసర్లందరూ ముందువరసలో నిల బడితే కెంటుస్టేటులో పోలీసులు కాల్పులు చేయగల్గేవారా? డెమాక్రటిక్ కన్వెన్షన్‌లోని లిబరల్స్ అయిన యుద్ధవ్యతిరేక సెనేటర్లందరూ బయట ప్రజలతో వుండివుంటే పోలీసులు అంతపైశాచికంగా ప్రవర్తించలేరు. ఆ సెనేటర్లలో ఒకరుపోలీసులను గెస్టపోతో పోల్చారు. అలాఅన్నంత మాత్రాన ప్రయోజనమెంత? అతనే రక్తంకారే వరకూ పోలీసులతో కొట్టబడుతూ ప్రజలలో నిలచివుంటే ప్రయోజనం ఎలావుండేది? వియత్నాం విషయంలో అమెరికాప్రభుత్వంలో ఒకవైరుధ్యంవుంది. యుద్ధాన్నిముగించాలని కోరుతున్నట్టు చెప్పుకుంటుంది. కాని నిజంగా యుద్ధాన్ని విస్తృతం చేస్తోంది. ఈవైరుధ్యం ఆధారంగా చాలా ఎక్కువ పని చేయొచ్చు

గెరాసీ— ఈ కార్యక్రమం వ్యవస్థనే కూలదోసే వుద్యమంగా అవుతుందా? విప్లవ దృక్కోణంనుంచి ఆలోచిస్తే— అల్జీరియా ఫ్రాన్స్‌లో అటువంటి అతివాదాన్ని సృష్టించిందా?

సార్త్ర్— లేదు. మేం ప్రయత్నంఅయితే చేసాం. ఈ యుద్ధాల సంబంధమైన అలాంటి పాలసీ మౌలికంగా నైతికమైనటువంటిది. అయినా మంచిదే. వియత్నాంలో అల్జీరియాలో, ఛాడ్‌లో యుద్ధంచేయనని ధిక్కరించటం మంచిది, ప్రోత్సహిం చదగిందీను. కాని విప్లవపద్ధతి ఏమిటంటే స్వదేశంలో అన్యాయాన్ని యెదుర్కో వటం. పెట్టుబడిదారీ దేశంలోని దోపిడీ, జాతివివక్ష, అన్యాయం, యుద్ధాలకు తప్పనిసరిగా దారితీస్తయ్. ఆశయానికి కట్టుబడినామనే మేధావులకు ఇక్కడే పరీక్ష. ఇవన్నీ కలసి ప్రజాబాహుళ్యంతోకూడిన విప్లవోద్యమ నిర్మాణానికి పూనుకొంటామా అని. యుద్ధాన్ని విరసించటం తప్ప ఏమీ చేయకపోవటం తేలికే. మనమధ్యనే జరుగుతున్న అసమానతలను అన్యాయాలను, అమాను షాలనూ ఎదుర్కోవటం, ఆ రకంగా మన సుఖజీవనాలను వదలుకోవటం కష్ట మైనవవి. కాని కార్యాచరణఅంటే యిదేమరి. అదే నిజమైన పోరాటంకూడా

ఆశయానికి కట్టుబడిన అమెరికాలోని ప్రతి మేధావీ బాబీసీల్‌ను విడిపించటానికి తయారవాలి.

గెరాసీ- ఎరికా బాబీలను క్రియాశీలంగా బలపర్చటానికి వీలులేనట్లు యేల్‌లోని మేధావులకు బ్లాక్ పాంథర్స్‌లో విమర్శనీయమైన అంశాలు చాలా కన్పిస్తున్నయ్.

సార్త్రె- అవును. అదెలావుంటుందంటే, జర్మన్ నాజీలను కమ్యూనిష్టులే ముఖ్యంగా ఎదుర్కొంటున్నారు. నాకు కమ్యూనిష్టులతో విభేదాలున్నయ్. కాబట్టి నేను ఆ ప్రతిఘటనలో పాల్గొనను అని అనటంలాగ. అలాంటి సందర్భాలకొరకు ఒక పదం వుంది. కొలాబరేషనిష్ట్. రాజీపడేవాడు అని. ఇక్కడ ఫ్రాన్స్‌లో కూడా రాజీపడేవాళ్లు చాలామందివున్నారు. వారు మే '68ని అర్థంచేసుకోలేరు. మేధావులకుండే సురక్షితస్థానాలుపోయాయనీ. పవిత్రకేంద్రాలులేవనీ గ్రహించటానికి అంగీకరించలేకపోతున్నారు. యూనివర్సిటీ లేబరేటరీ, పరిశోధనా కేంద్రం యివన్నీ తిరుగుబాట్లనణచే పోలీసు సంస్థవలెనే ప్రభుత్వ సంస్థలే. మేధావి కర్తవ్యం పోరాటాలు ఎక్కడజరగాలని నిర్ణయించటం కాదు; పోరాటాలు ఎక్కడజరుగుతున్నా. ప్రజలెక్కడ పోరాడుతున్నా వాటిలోపాల్గొనటం.

గెరాసీ- ఇంకా ప్రజలవాణిగా పోరాడే ప్రజల నాలుకగా పనిచేయటంకూడా!

సార్త్రె- అదే సమయంలో పోరాడుతూకూడా వుంటేనే పోరాడే ప్రజల నాలుకగావుండగల్గుతాడు. ఆశయ నిబద్ధత ఒక క్రియాత్మకచర్య, ఒక మాటకాదు.

(అనువాదం : ఆట్లూరి రంగారావు)

---



---

# స్నేహశీలి చిరంజీవి



అక్టోబర్ 16న దాదాపు రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో మధ్యలో ఆపేసిన ఒక వ్యాసం రాసుకుందామని బల్లదగ్గర కూర్చున్నాను. అందుబాటులోఉన్న రేడియో ఊరికే తిప్పాను.

'పరిఖ్యాత తెలుగుకవి నార్ల చిరంజీవి..' అని వినిపించింది. పరిఖ్యాత అనే విన్నానో ప్రముఖఅనే విన్నానో నాకిప్పుడు గుర్తులేదు రేడియోలో ఆయన పేరు వినగానే బహుశా ఆయన నాటకం వస్తున్నదేమోఅని అట్లాగే వింటూ కూర్చున్నాను.

"…. ఈ ఉదయం 11-30 గంటలకు గుంటూరులో మరణించారని చెప్పటానికి విచారిస్తున్నాం" అని వినిపించింది. తరవాత ఇద్దరి పరిసంగాలు వచ్చినై ఆయన్ను గురించి. ఒక్క క్షణం ఏమీ తోచలేదు. లోపలికొచ్చి ఒక పావుగంటో అరగంటో కళ్ళుమూసుకు పడుకున్నాను. ఈ వార్త మా ఆవిడకి చెప్పాలని తోచలేదు. ఎట్లా చెప్పాలో తెలియలేదు.

అంతకుముందటి ఆదివారం అక్టోబర్ 10న చిరంజీవిగారి దగ్గరికెళ్ళుతున్నానని చెప్పి ఇంట్లో బయలుదేరాము. కాని దారిలో ఇంకొకచోట ఆలస్యమయి వెళ్లలేదు. అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా బాధగా ఉంటుంది. ఇప్పుడెన్నిసార్లు వెళ్తేఏం? పూర్వం ఎన్నిసార్లు వెళ్తేఏం? చివరిరోజుల్లో తరచుగా వెళ్లి ఆయనదగ్గర కూర్చొని ఆయనతో మాట్లాడిరాఃపోయిన లోపం ఇంకా నన్ను బాధిస్తూనేఉంది. వెళ్దాం వెళ్దాం అనుకునే లోపునే ఆయనే వెళ్ళిపోయాడు. చిరంజీవిగారు మళ్ళీకనిపించరు అనే నిజం ఇంకా నా బుద్ధికి సరిగ్గా అందడంలేదు. అప్పుడప్పుడు ఇప్పటికీ అవ్యక్తంగా అనుకుంటుంటాను చిరంజీవిగారింటికి వెళ్లాలి. వెళ్ళితే "ఏం డాక్టరు గారూ కనపట్టంలేదు" అంటారు. ఏం సమాధానం చెప్పటానికి చేతగాక ఊరుకుంటాను. ….కాని అడగడానికి ఆయన ఇక కనపడరుఅన్న నిజం గుర్తుకొచ్చి, మనస్సు కలుక్కుమంటుంది.

చిరంజీవిగారితో పరిచయం ఏర్పడి ఐదేళ్లన్నా అయిందోలేదో ఎంతో సన్నిహితులమయ్యాం. మనసున్నవారికి మనసివ్వగల మనస్వి ఆయన.

మొదటిసారి విశాలాంధ్ర బుక్ హౌస్‌లో కలుసుకున్నాం. నరసింహారెడ్డి(శక్తి) మమ్మల్ని పరిచయం చేశాడు. అభ్యుదయలో మాత్రా ఛందస్సులమీద రాసింది మీరేనా? అని అడిగారు. నన్ను గురించి ఆయన జ్ఞాపకంఅది. ఆయనా చాలా కథలు, నాటకాలు, కవిత్వం రాశారు, కాని ఆయన్ను గురించి అప్పటికి నాకు 1955లో విశాలాంధ్రలో రాసిన లేఖ గుర్తు.

ఆరోజుల్లో నేను ఇంటర్మీడియేట్ చదువుతున్నా. ఆంధ్రదేశంలో బైఎలక్షన్లు జరుగబోతున్నై. కమ్యూనిష్టు పార్టీ తనసర్వశక్తుల్ని కేంద్రీకరించి ఆంధ్రదేశంలో ప్రభుత్వాన్ని ఏర్పరచాలని ప్రయత్నించిన రోజులవి. శ్రీశ్రీ కమ్యూనిష్టుపార్టీ తరపున ఎన్నికల ప్రచారం చేస్తున్నారు. దేశానికి రాబోతున్న "ఎర్రిపర్రిమాదాన్ని" పెట్టుబడి కూటాలు పసిగట్టినై, వాళ్లలోఉన్న అంతర్గతవైరుధ్యాలను తాత్కాలికంగా మరచారు, రచయితల్లోకూడా సంచలనం వచ్చింది. పెట్టుబడికూటాలు కొందరురచయితల్ని రంగంలోకి దించారు. వాళ్ల "రచయితల లక్ష్యప్రకటన" అని ఒకపత్రం తయారుచేసి ఒక తెలుగుపత్రికలో ప్రకటించారు. ప్రజాస్వామ్యానికి పెద్ద ప్రమాదం వచ్చేసిందని గోల పెట్టారు. ఇప్పటి కొందరు "సోషలిష్టు కవుల" సంతకాలు కూడాఉన్నై ఆలక్ష్య ప్రకటనలో. ఆలక్ష్యప్రకటనను తన సంతకంకోసం పంపగా చిరంజీవిగారు సుదీర్ఘమైన లేఖరాసి విశాలాంధ్రలో ప్రకటించారు, అదిఆనాడు ఎందరినో ఆకర్షించింది. ఇప్పటికీ దాన్ని భద్రంగా దాచుకొన్నవాళ్లని ఎరుగుదును,

1950 ప్రాంతంలో కాటూరు (చిరంజీవి గారి స్వగ్రామము) లోమన అహింసా పోలీసులు ప్రజల్ని గుడ్డలూడదీయించి గాంధీ విగ్రహం చుట్టూ తిప్పించినప్పుడు ప్రజాస్వామ్యానికి ప్రమాదంరాలేదా? విచక్షణారహితంగా ఇళ్లమీద దాడిచేసి అందర్నీ హింసించినప్పుడు ప్రజాస్వామ్యానికి ప్రమాదం జరగలేదా? కనిపించిన పుస్తకాలన్నీ (అందులో పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్రకూడా ఉందట) తగలబెట్టినప్పుడు ప్రజాస్వామ్యానికి ప్రమాదం జరగలేదా? అని నిగ్గదీసిఅడిగారు, పెట్టుబడికూటానికి సిగ్గువిడిచి కొమ్ముకాసిన రచయితలను.

చిరంజీవిగారింట్లో కూర్చుని ఎన్నో రాత్రిలు ఎన్నో విషయాలను మాట్లాడుకొన్నాం. తనుఉద్యమాల్లోపనిచేసిన రోజులనాటి కథలు ఎంతోఆసక్తితో వినేవాణ్ణి, ఈమనిషిలో ఇంత కరుకుదనం, మొండితనం పట్టుదలా ఉన్నయ్యా అని ఆశ్చర్యం వేసేది.

నేనూ నరసింహారెడ్డి తరచుగా కలిసివెళ్తుండే వాళ్ళం. మళ్లీ తెల్లారే తిరిగి రావటం, ఎన్నో విషయాలు మాట్లాడేవాళ్లం. రచయితలని గురించి రచయితల ఉద్యమాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి—ఎన్ని విషయాలో చర్చించేవాళ్లం. నేనురాసే భాషావ్యాసాలు ఆయనకు ఇష్టం—వాటిలో విషయాలను గురించి పూర్వపక్షం చేసినన్ను రెచ్చగొట్టాలని చూసేవారు. ఇదంతావిషయం తెలుసుకోవాలన్న ఆసక్తితో మాత్రమే చేసేవారు.

ఆయనకు తెలుగులో ఇంగ్లీషు మాటలు కలవటం ఇష్టం ఉండేది కాదు. నాభాషా వ్యాసాలను గురించి ఆయన విమర్శిస్తుండేవారు "ఇంగ్లీషు మాటలు ఎక్కువైనట్టున్నయ్యే"అని.

నేను భాషాశాస్త్రింలో పడ్డాక బొత్తిగా సాహిత్యాన్ని గురించి ఆలోచించేవాణ్ణి కాదు, కాని చిరంజీవిగారి దగ్గరకెళ్లినప్పుడు తప్పనిసరిగా అప్పటిసాహిత్యాన్ని గురించి మాట్లాడుకునే వాళ్లం. భాషాశాస్త్రిం మీదవిసుగెత్తినప్పుడు ఆయన దగ్గరికిపోతే విశ్రాంతి దొరికేది, కొత్తవాతావరణంలో ఉన్నట్టుండేది.

ఆయన తన'కొమ్మలూ, రెమ్మలూ'లోని పద్యాలు చదువుతుంటే నేనూ నరసింహారెడ్డి తన్మయంతో వినేవాళ్లం. ఆ పుస్తకానికి నరసింహారెడ్డిచేత బొమ్మలు వేయించాలనీ నాచేత పీఠిక రాయించాలనీ అంటుండేవారు. నరసింహారెడ్డి కొన్ని బొమ్మలు వేశాడు కూడా.

చిరంజీవిగారు ఎక్కువగా మనుషులతో తిరిగేవారుకారు. కలిసిన మనుషులతో అరమరికలు లేకుండా కలిసిపోయేవారు.

ఆయన కథలున్నై. నాటకాలున్నై. కమ్మని కవిత్వం ఉంది. ఎన్నిఉన్నా బాధలన్నీ తనలోనే దాచుకొని, ఎప్పుడూ చిరునవ్వుతో కనిపించే చిరంజీవిగారులేని లోటు నాగరత్నమ్మగారికేకాదు, నాకూ, నరసింహారెడ్డికీ, భాయిజాన్ రంగాచార్యులు గారికీ తీరేదికాదు. ఆయనతో గడిపిన జ్ఞాపకాలే మాకు మిగిలింది.

జీవితంలో ఇట్లాంటివి ఎవరికైనా ఎదుర్కోక తప్పదు.

— చేరా

పాట :

## మనోళ్ళు!

జనసేన

ఎవరు వాళ్ళు ?
ఎవరు వాళ్ళు ?
ఎవరి వాళ్ళు !
ఎవరు వాళ్ళు !

ఎవరి కోవకు చెందినోళ్ళు !
ఎవరి దోవను నడచినోళ్ళు !!
ఎవరి కోసం వచ్చినారు !
ఎవరి కోసం 'పోయి'నారు !!

కత్తి బల్లెం విల్లుఅమ్ములు– గండ్రగొడ్డలి ఈటె రైఫిలు
చేత జండాల్–డాళ్లువీలుగ,–పట్టుకోని,–
సాళ్ళు సాళ్ళుగ నడచినారు.
సరాసరి 'అటు' వెళ్ళినారు. ఎవరువాళ్ళు?
ఉత్త మాటలు కట్టిపెట్టని– ఉమ్మడిగ గళమెత్తినారు
చేయెత్తి జై జై కొట్టినారు. సత్తెముగ సూరీనిలాగ ఏంచక్కా–వెళ్ళినారు
ఎవరువాళ్ళు !

బాంబు సంచట సంకనుంది– భుజంపైన తుపాకివుంది
కాసులకు, నక్లీస్‌లకుగా,– తోటదండాల్ వేసుకోని
రుద్రమాంబా, ఝాన్సిరాణీ, రూపురేఖలు పోలివుండీ
అందచందాలన్ని మరచి, ఆడమగతేడాలెవిడిచి,–
అగ్గి పాటలు పాడుకుంటు, ఆశలను రేకెత్తినారు– ఎవరువాళ్ళు !

ఎక్కడెక్కడికెళ్ళినారో !
ఎన్ని ఊళ్ళు తిరిగినారో !! దుబ్బబారిన కాళ్ళు వేళ్ళు
ఎర్రబారిన కనులకొనలూ– కాయగాసిన చేతులబ్బా !
ఒక్క పల్చని శరీరాలు, ఒక్కతీరుగ నడచినారు.
చూడబోతే పేదవాళ్లూ ! ధైర్యసాహసమున్న వాళ్ళు ఎవరువాళ్ళు !

దద్దరిల్లు నినాదమిచ్చి-యుద్ధనీతిని అభయమిచ్చి.—
పుచ్చిపోయిన ఇంటిపాలన-కుళ్ళిపోయిన ఒంటికెందుకు ?
చీము, కుళ్ళు, మూల్గురోగికి, పట్టుబట్టల కప్పులెందుకు ?
కుష్ఠు, బొల్లి, దగ్గు, క్షయ, రోగాల, సంఘం మురుగు పురుషుల
'పడుచు'రాజ్యం కట్టబెట్టే పౌరశాస్త్రపు చదువులెందుకు ?
మొద్దు ఇద్దరు ముసుగులెందుకు?,—ప్రశ్నకొడవళ్ళెత్తినారు
ప్రగతి బాటల జూపినారు, ఎవరు వాళ్ళూ - ఎవరి వాళ్ళూ !

ఒకరి చెంపకు కత్తిగాటు, ఒకరి చెంపన కట్టెదెబ్బ
కణత పక్కనె కమిలిపోయి కన్నుమూసుకుపోవువాపు,
నొష్ట బొప్పెం. ఎండు పెదవులు. నెత్తురి మరకలబట్టలేసుకు
ఇదే బాటల వెళ్ళినారు...... అదే 'మలుపు'కు మళ్ళినారు ! ఎవరువాళ్ళూ,

శాంతి సామ్యం ముక్తి బాటల క్షేమకరమౌ నీడనిచ్చే నిజంవిత్తుచు,
సుత్తెకొడవలి చిహ్నములతో-ఎర్రజెండా లెత్తినారు, ప్రజల వెల్లువ
పాడినారు. వెలుగు ఎలుగునె చాటినారు,......
తేట తెల్లం జేసినారు, కోట పోటుల దాటినారు. ఎవరువాళ్ళూ !

చెమటకారీ-నున్నబారీ మెరసిపోయే దేహకాంతుల
ధనం మూలం దెలిపినారు, కొత్తపాటలు పాడినారు......
......వల్లమాలిన బతుకులొద్దని, పల్లవిగ గొంతెత్తినారు.
దిక్కులేని కుక్క బతుకులు, నంగనాచీ నక్కబతుకులు
వద్దువద్దని అసలు వద్దని ముష్టి మనిషిగ బతకవద్దని
మనిషి మనిషిగ బతకవలెనని
మనసుకోరిరి, మనసు చెప్పిరి. ఎవరువాళ్ళూ !

రా - మనోళ్ళే
లే - మనోళ్ళే

చావుబతుకుల కుములువాళ్ళకు ఆకలని అల్లాడు జనముకు
ఆశకొనపూబూచునట్లు చచ్చుమోడు చిగుర్చునట్లు
జీవకళలను పంచినారు చావు విలువల పెంచినారు ! ఎవరువాళ్ళూ !

లే ! మనోళ్ళే !
రా ! మనోళ్ళే.

# జానపద కవిత్వం

చలసాని ప్రసాద్

'నానృషిః కురుతే కావ్యం' పండిత వాక్యం. పూర్వజన్మ సంస్కారంవల్ల, పరమేశ్వరుని కృపవల్ల ఎవరూ కవులుకారు. కవులు ఆకాశం నుంచి వూడిపడరు. ప్రతి మనిషిలోనూ అంతో ఇంతో కవిత్వం వుంటుంది. అందుకే *Eric Gill* అంటాడు *"The artist is not a special kind of man but every man is a special kind of artist"* అని. కళాకారుడు విశిష్టమానవుడు కాదుగాని ప్రతి మానవుడు ఒకవిశిష్ట కళాకారుడే. శ్రామికజీవనమే అన్ని కళలకు, కవిత్వాలకు మూలం. సామాజికజీవితమే ఒకగీతిక. అందుకే

జాతికి జీవననాళిక
జానపదగీతిక      అన్నారు శ్రీ శ్రీ.

శిల్పం భాషదగ్గర మొదలవుతుంది. గుండెల్లోవున్న భావానికి సూటి అయిన మాట వాడడమే ఉత్తమశిల్పం. నేలవిడిచి సాముచేయలేనట్టే, జనాన్నివిడిచి కవిత్వం వనలేదు. ప్రజల గుండెలనుంచి బాహిరిల్లేదే జానపదగేయం. గుండెల కొండలలో మారుమోగాలి మన కవిత. అప్పుడే దానికి సార్థకత. ప్రజలకు అందుబాటులోలేని కవిత– ఎంత శిల్పసౌందర్యంతో, మరెంత శయ్యాసౌభాగ్యంతో మిరుమిట్లుగొలిపినా– నిరర్థకం, ఎందుకంటే "చారెడేసి కళ్లుంటేమాత్రం శవంవల్ల ఏంలాభం?" ఒకరకంగా మార్గకవిత్వం శవప్రాయం. దేశికవిత్వం సజీవం.

తెలుగులో మార్గ, దేశికవితలు మొదటినుంచి వున్నాయి. శ్రీమదాంధ్ర మహాభారత అవతరణకు ముందే తెలుగులో మంచి కవిత్వం వుండివుంటుందని తేల్చారు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. అయినా మనం ఆదికవిగా ఇంకా నన్నయ్యగారినే కొలుస్తున్నాం. 'కన్యాశుల్కం'లో రామప్పంతులన్నట్టు అదివేరే కథనుకోండి. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే తెలుగులో దేశికవిత్వం మొదటినుంచి వుంది. కాని శివకవులు చేపట్టేవరకు అది వెలుగులోకి రాలేదు. పాల్కురికి సోమనాథుడి 'పండితారాధ్య చరిత్ర', 'బసవపురాణం', ఆనాటి సామాజిక జీవితానికి దర్పణాలు. శివకవులు మతావేశపరులైనా కవిత్వాన్ని ప్రజలకు అందుబాటులోకి తెచ్చారు. దేశికవిత్వం యుగయుగాల నుంచి ఒకపాయగా తెలుగు కవితావాహినిలో ప్రవహిస్తూనేవుంది.

తెలుగు కవిత్వంలో వేమనది విశ్వజనీనమైన గొంతు. దురదృష్టవశాత్తు వీరేశలింగంగారి కవుల చరిత్రలో వేమనపేరు కంచుకాగడాపెట్టి వెదికినా కనిపించదు.

తెలుగులో పండితులకు, పామరులకు మధ్య అగడ్త ఉందనడానికి ఇదే తార్కాణం. వేమన కవిత్వాన్ని ఇవాళ ప్రత్యేకంగా పరిచయం చేయాల్సిన అవసరంలేదు. జీవితాన్ని, సమాజాన్ని కవిత్వానికి పర్యాయపదాలుగా చేసిన మనీషి వేమన.

ఆధునికకాలంలో గురజాడ దేశికవితా స్రవంతిని ఉరకలెత్తించి ఉవ్వెంగించాడు.

ఈ దేశికవితాశాఖ అందరికి తెలిసిందే. ఇదికాక ఎన్నో వేల పల్లెపాటలు మరుగునపడిపోయాయి. వాటి ఆలన, పాలన ఎవరూ పట్టించుకోలేదు. పాటకజనుల గుండెల్లోపుట్టి, వారి నాలుకలపై నాట్యమాడి, ఆనోటా ఆనోటాపడి నేటికీ నిటారుగా నిలబడి తమచేవను, పసను ఋజువుచేసుకుంటున్నాయి. పల్లెపాటలను ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చి కొన్నిసాహిత్య సంస్థలు, కొందరు వ్యక్తులుసేకరించి అచ్చువేశారు. అది తరగని గని. పసిడిపాతర. వాటిని మనం స్వాయత్తం చేసుకోవాలి. పల్లెపాటలను మనం మరీమరీ మననంచేసి వాటిని నేటి ప్రజాజీవితానికి అనుగుణంగా మలిచి సజీవ కవిత్వాన్ని రాయాలి.

పాటుపడేవాళ్ళు పాడేది పాట. పాటక జనంలో నిలిచిపోయేదే పాట, అదికలకాలం వుంటుంది. పాట గుండెను మీటుతుంది. పాటల విలువ ప్రజా జీవితాల్లో కలిసిపోయిన వాళ్ళకే తెలుస్తుంది, పాటలేకాకుండా మన పల్లెటూళ్ళలో అనేక రకల పదాలు కూడావున్నాయి,

ఉదా:— తుమ్మెద పదాలు, గొబ్బిపదాలు, వెన్నెల పదాలు వగైరా బాలనాగమ్మకథ, చిన్నమ్మకథ, కామమ్మకథ, దేసింగురాజుకథ, కాటమరాజుకథ, బొబ్బిలియుద్ధం ఇలా లెఖలేనన్ని రాశారు. వీటిలోని కవితా గుణం, కావ్యత్వం కలకాలంనిలిచిపోతాయి.

పదకవిత్వానికి తెలుగులో చాలా మంచిపేరుంది. నిజంగా జరిగిన కథలను తీసుకునే పదకవిత్వం మూడు పూవులు ఆరు కాయలుగా పెరిగింది. అమాటకొస్తే భారత రామాయణాలను కూడా పదకవితలుగా రాశారు. అందుకనే ఆ ఇతిహాసాలు జనంమదిలో నేటికీ నిలిచి వున్నాయి. పాటలకు, పదకవిత్వానికి వున్న పాత్రిచుర్యం ఎంత రాసినా తరగదు. దిగితేగాని లోతు తెలియదన్నట్టు జీవితంలోకి దూకితేగాని వాటి చేవ తెలీదు.

తెలంగాణలో జానపద కవితారీతులను ఆకళింపు చేసుకుంటూ నేడు మరిచి కవిత్వం రాస్తున్నవారున్నారు విప్లవకవులలో ముందు వరుసల్లో నిలబడేది వీళ్ళే. ఇంకా ఇలాంటి కవితలు ఎక్కువగారావాలి.

శివుడు 'నరుడో భాస్కరుడా' రెంజిమ్ 'ఛెల్లీఛెంద్రమ్మ!' లాంటి చిక్కటి పల్లె పదాల్లు రాసి విప్లవకవిత్వంలో దేశికవితకు ఒరవడి పెట్టారు. ఆ ఒరవడిలోనే కొక్కొ

రోకో' అని కోడి కూసింది. అలాగే తక్కిన ప్రాంతాలలోని జానపద కవితారూపాలను ఆయా ప్రాంతాల విప్లవకవులు మననం చెయాలి సర్కారు జిల్లాలలో పల్లెపాటలు ఎన్నో వున్నాయి. కొనకళ్ళ 'బంగరు మామ పాటలు' నండూరివారి 'ఎంకిపాటలు' ఆకోవలో రాసినవే. అలాగే రాయలసీమ, నెల్లూరులో కపిలపాటలు, విసరురాతిపాటలు, కలుపు పాటలు, జట్టిజాము పాటలూను.

"చిన్నవాడూ చిత్తకుక్కా
చిన్నమరిదీ చింతకొరివీ
పెద్దబావా పిట్ట పిడుగూ
తోడికోడలు కోడెనాగూ"

"కట్టెలమ్మీ కసువులమ్మీ కడిమిపూవులచీరదెచ్చీ
కుచ్చుబోసీ కట్టబోతే— కులుకునడుమే ఇరుకు బట్టె"

"నూలుపండి నూబిండి ఎరుగ
వడ్లుపండి వరికూడు ఎరుగా
ముగ్గురు బిడ్డల తల్లినైతీ
మొగుడి గుర్తు మొదలె ఎరుగా"

'కొక్కొరోకో'లో అన్నీ బతుకు పాటలే. జనంగుండెల్ని పిండేసి, వాళ్ళలో చైతన్యం రగిలించి, వారిని కార్యరంగంలోకి దూకించేది యీ పాటలే,

కాలిమంటు కున్నాది కూలన్నా
బతుకు యుద్ధములోన నిలువన్నా

అంటూ చెరబండరాజు రోదనగీతం ఆలాపిస్తున్నాడు,

మాలోని మనిషివే
మామనిషివే నీవు

అని పొట్టకూటికి పోలీసుగా మారిన సాటి మనిషిగుండెలోతుల్లో జొరబడి రొదపెడుతున్నాడు

అందుకే పేదోళ్ళు తిరగబడుతున్నారు
నిన్నుకూడా తోడు ఉండమంటున్నారు

అంటూ చెయ్యి కలిపాడు,

యస్. ఆర్. "వలయేయెసెల్లీ" అంటూ
నీటి కడుపులోన నీలాలనిప్పు
నిప్పుతో మనకళ్ళు యిప్పుకుందాము

నీటినీ కదిలించి నిదురలేపాల
అలలపై మన కలల పడవ కదాలాల     అవి
శ్రమజీవులందర్నీ ఒకే బాటగా ఒకే పాటగా కదిలి రమ్మంటున్నాడు.
పేదోళ్ళు ఎక్కడ మోసపోతారోననే ఆవేదనతో పవనకుమార్

ఎన్నికలు ఏలరా ఎర్రినాగన్నా
ఎర్రిజెండాకింద కన్నెర్రిచేయరా
కన్నెర్రిచేసి నీకలలు పండించరా

అంటూ తట్టి లేపుతున్నాడు,

కళ్ళు నులుముకుంటూ లేచినజనానికి దివిటీ చూపిస్తున్నాడు సుధాకర్. బెబ్బులిలా గర్జిస్తున్నాడు.

తండెనక తండవుంది
గుండెల్లో మంటవుంది
ఏ గుండె నార్పుతావు
డబ్బున్న భడవకొడకా

జానపద కవిత్వం రాయడమంటే కేవలం ఆ మాటల్ని పోగుచేసి, ఆ బాణీలను పుణికిపుచ్చుకుని కవితల్లడంకాదు  తమ బాధలను గాధలను ప్రజలెలా పలవరిస్తారో విప్లవకవులు ఆకళింపుచేసుకోవాలి.

రాకాసి నాకొడుకులు రామయతండ్రీ
నను సీకాకు పెడతారు రామయతండ్రీ

దీనిలో చక్కటి చిక్కటి తెనుగుదనముంది. తెలుగువాడు తనబాధను, కసిని ఎలా వెల్లడిస్తారో చెప్తుందాగేయం. నీటిలో చేపల్లా జనంలో కలిసిపోవాలి విప్లవకవులు. జనంగుండెల్లో కవులు పరకాయప్రవేశం చేయాలి. సమాజంతో తాదాత్మ్యంచెందాలి, "పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట"అన్నాడు పోతన. అలాగే "పలికెడిది విప్లవమట. పలికించెడివారు వీరభద్రుళ్ళట" అనాలి మనం.

కవిత్వానికి ఆవేశం ముఖ్యం. వీరావేశం తెలుగు గుండెల్లో పొంగి పొర్లుతుంది. తిక్కన విరాటపర్వంలో మూలానికి మెరుగులుపెట్టాడని, ఎంతో వన్నె తెచ్చాడని అంతా ఒప్పుకుంటాం. భారతశక్తి ద్రౌపది కీచకుడిని ఎలాభయపెట్టిందో తిక్కన వర్ణించాడు.

దుర్వారోద్యమ బాహువిక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపాటవుల్ మత్పతు

గీర్వాణాకృతు లేవు రిష్టనిను దోర్లీలన్ వెసన్‌గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముంగొనుట తథ్యంబెమ్మెయింగీచకా—

విరాట పర్వంలోని ఈ ఘట్టాన్నే తీసుకుని తెలుగులో పదకవిత అల్లారు. భారతశక్తి ద్రౌపది కీచకుడిని భయపెడితే, తెలుగు ఆడపడచు ద్రౌపది కీచకుడిని నిలబెట్టి శిలవేస్తుంది

నిను సంపి నీ నెత్రు
బొట్టెట్టుకుందు

ఇదీ తెలుగుదనం. తెలుగువాడి వేడి ఇదే. అందుకే నార్లవారన్నారు "పెద్దనామాత్యుని 'మనుచరిత్ర' తాళపత్ర గ్రంధరూపంలో వుండగా చెదపట్టిపోయి మనకు దక్కకుండా పోయినా శోకించివుండేవాణ్ణికాదు. కాని మన జానపదగీతాలు మటుమాయమైతే మాత్రం ఎంతో విచారిస్తాం" అని.

పల్లెపాటల్లోని చేవ, చతురత, పసందు, వీరావేశం మార్గకవితలో మచ్చుకి కూడా కానరావు. తెలుగువాడి గుండె చప్పుళ్ళను సంస్కృత వృత్తాలు పలికించలేవు. శ్రీనాధుడి 'పల్నాటి వీరచరిత్ర' ముందు అతని మార్గకవిత యావత్తు తీసికట్టే. వీరావేశాన్ని మన జీవనాడుల్లో పొంగించి గుండెలను కొత్తనెత్తురుతో నింపాలి. అదేమంచి కవిత్వం.

శ్రమజీవుల కవిత్వమే జానపద కవిత్వం. కాయకష్టం చేసేవాళ్లు తమ తమ వృత్తులనుబట్టి, పనిముట్లనుబట్టి పల్లెపదాలు పాడతారు.

1937లో 'ప్రతిజ్ఞ' చేశాడు శ్రీ శ్రీ

కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం,
జాలరి పగ్గం,
సాలెల మగ్గం,
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి,
సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు—
నా వినుతించే
నా విరుతించే
నావినిపించే నవీనగీతికి
నావిరచించే నవీనరీతికి
భావం!
భాగ్యం!

ప్రాణం !
ప్రణవం !

కాని జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి "ఆతరవాత నువ్వే ప్రతిజ్ఞాభంగం చేశావ్" అని వెక్కిరించాడట శ్రీశ్రీని. అది నిజమే. అయితే శ్రీశ్రీని యివాళ మరో 'మహాప్రస్థానం' రాయమనడం *poetic justice* కాదు. శ్రీ శ్రీ కవిత్వాన్ని మనం ముందుకు తీసుకెళ్ళాలి. జనం గుండెల్లో చొప్పించాలి. "నా ఆకాశాలను లోకానికి చేరువగా, నా ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వలజడిగా" అందించాల్సిన పూచీ నేటి విరసం వారిదే.

విప్లవ కవిత్వం పాటల్లో, పదాల్లోపొదిగి జనం గుండెల్లో ఒదిగిపోవాలి. ఆ పాటలోనే అందరం సాగిపోవాలి. జనంకోసమే కవిత్వం. వారి చైతన్యమే విప్లవాలకు కాంతి. జనానికి అందనిది, జనాన్ని తట్టిలేపనిది కవిత్వం అనిపించుకోదు. అందుకే స్టాలిన్ అన్నారు "*Artists are the Engineers of the human soul... Art must be national in form and Socialistic in content.*" కళాకారులు మానవహృదయ నిర్మాతలు. కళ జానపదరీతులలో, సామ్యవాద భావాలతో విలసిల్లాలి.

## భావ స్వాతంత్ర్యం

ఎందుకు, ఎక్కడ, ఎంతవరకు ?

కె. వి. రమణారెడ్డి

మనిషన్నవాడికి తిండి గుడ్డలాంటి భౌతికావసరాలతోబాటు స్వాతంత్ర్యంకూడా తప్పనిసరి. పరిపూర్ణమైన స్వాతంత్ర్యం గగనకుసుమం కావచ్చునేమోగాని సంఘంలోని ఇతరులకు ఇబ్బంది కలగనంత మేరకైనా, ప్రతివ్యక్తికీ స్వాతంత్ర్యం ఉండాలి. లేకుంటే, వ్యక్తికి వికాసమూ ఉండదు. సంఘానికి పుష్టీ ఉండదు.

స్వాతంత్ర్యం అంటే ఇష్టారాజ్యంకాదు. స్వేచ్ఛ అంటే యథేచ్ఛకాదు. సంఘజీవిగా వ్యక్తుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు పరిమితులు తప్పవు. ఈ పరిమితులు సమిష్టి ప్రయోజనంకోసమే. సమిష్టి ప్రయోజనం ఇది అంటూ ఎక్కడా కనిపించక పోయినంతమాత్రాన, అలాంటిదేదీ లేనేలేదనడం సరికాదు. అది వ్యక్తివాదానికి లాక్కెళ్లతుంది.

స్వాతంత్ర్యం అంటే హక్కులు. అవి ప్రభుత్వం ఇచ్చేవిమాత్రంకావు. ప్రభుత్వంపని, ఉన్న హక్కులను గుర్తించి అమలుపెట్టడంవరకే. రాజ్యాంగ చట్టంలో పొందుపరచి సాధారణ శాసనాలకు అతీతంగానిలిపి న్యాయస్థానాలు నిర్ణయించే వీలు కల్పించి, ప్రభుత్వాలు హక్కులను గౌరవించాలి. ప్రభుత్వానికి వ్యతిరేకంగాకూడా వీటిని వ్యక్తులు కోరి అమలుపెడితే, ప్రభుత్వం తలవంచ వలసిందే. హక్కులంటేనే, ప్రభుత్వాధికారానికిగల పరిమితులని అర్థం. ప్రభుత్వాన్ని బలపరచడానికీ, గంగెద్దులా తల ఊపడానికీ, హక్కులే అక్కర్లేదు. ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించడానికే, ధిక్కరించీ నిలవడానికే అవి అవసరం.

ఇంతవరకూ నేను రాసింది, పాలిటిక్స్ క్లాసుల్లో హక్కులగురించి అధ్యాపకుడు చేసే బోధనయొక్క సారాంశం.

ప్రాణం తర్వాత ప్రాణమంతటిది స్వాతంత్ర్యం. మనిషిని మనిషిగా నిలబెట్టేదనికూడా అనవచ్చు. బానిసను మనిషిగా పరిగణించ నక్కర్లేకున్నా, అతనికి స్వాతంత్ర్యంలేకున్నా, కనీసం తిండిగుడ్డలైనాకావాలి కాబట్టి ఆ మేరకు, ఆ మేరకైనా, బానిసకూడా మనిషి అనే గౌరవానికి తగును, వెనకటికి యుద్ధాల్లో పట్టుబడిన శత్రుసైనికులను నరబలి- నరమేధం- చేసేవాళ్ళు, అది తెలివితక్కువ అని గ్రహించి, వాళ్లను బతకనిచ్చి, అరవచాకిరీ చేయించుకునేవాళ్లు. బానిసల 'హక్కు'లను- ప్రాణాన్నీ దేహాన్నీ- రక్షించడానికి స్మృతుల్లో, అర్థశాస్త్రాల్లో కొన్ని కట్టుబిట్టాలుకూడా చేశారు. అమెరికా ప్రారంభకాలంలో నీగ్రో బానిసలకు 'రక్షణ'గా *Black Codes* అంటూ కొన్ని అమల్లో ఉండేవి. కాబట్టి బానిసలకే ప్రాణపోషణ అవసరమైతే, స్వతంత్ర వ్యక్తులకు మరెంత అవసరమనుకోవాలి?

మనుషులు పురుగుల్లాతప్ప బతకలేని సాంఘిక వ్యవస్థలో, చావుకీతప్ప పుష్కలమైన స్వేచ్ఛ మరిదేనికీలేని సాంఘిక వ్యవస్థలో, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు కాలిపట్టే ఉండదు. అసమానతకీ స్వాతంత్ర్యానికీ పొత్తు కుదరదు. కాబట్టి ధనస్వామ్యంలో స్వాతంత్ర్యం అనేది ఎండమావుల్లాంటిది. సోషలిస్టు వ్యవస్థలో వ్యక్తిస్వాతంత్ర్యం లేదని వాదించేవాళ్లు కనీసం ధనస్వామ్యంకింద వ్యక్తులు సంతోషంగా సంతృప్తితో బతికేలాగైనా హామీఇవ్వరు.

భావస్వాతంత్ర్యం, భావప్రకటనా స్వాతంత్ర్యం అందరికీ కావలసిందేగాని కళాకారులకు మరింతగా, మరింత అదనంగా కావాలి. భావాలతోనే తాను లావాదేవీ చేస్తాడు కాబట్టి, భావాల ద్వారానే తాను జీవిస్తాడు కాబట్టీ, ఏ వ్యవస్థలోనైనా కళాకారుడి ఈ రెండు స్వాతంత్ర్యాలూ కర్ణుడికి సహజ కవచకుండలాలలాంటివి. వాటిని

నిరాకరించినా, కుదించివేసినా, వట్టి సాదామనిషిగాతప్ప కళాకారుడుగానే జీవించలేడు, జీవించి రాణించలేడు.

ధనస్వామ్యంకింద, భ్రమలమధ్య జీవిస్తూన్న కళాకారులు ధనాధికారానికి ఏదో రూపంలో తాము కైంకర్యంచేస్తూన్న విషయాన్ని గుర్తించనంతగా ఆ పంచదారపూత విషగుళికకు అలవాటు పడిపొయ్యారు అంకితమివ్వడం, ఆశ్రియంకోరడం, పోషణకోసం వరపడడం, సహాయంకోసం చెయ్యిచాచడం, సంఘం దాని పాలకవర్గం ఆమోదించే విధంగా రాయడం, పాఠకలోకం ధాని చపలం గుర్తెరిగి రాయడం, ప్రచురణకర్తలు వారి మార్కెట్ దృష్టి భంగపడవిధంగా రాయడం- ఇంతాజేసి నాలుగురూకలు తెచ్చుకొని గంజేపానకమనుకోవడం. ఇదంతా, ఇదే. స్వేచ్ఛ అనుకోవడం- అలవాటైంది. బానిసకు తాను బానిసనన్న స్పృహే ఉండేట్టయితే, మరి కావలసిందేమిటి?

సోషలిస్టు సమాజం మనిషి సుఖజీవనానికి భౌతికమైన ప్రాతిపదికను ఏర్పాటు చేస్తుంది. తిండికోసం ఒకరి నోరు ఒకరుకొట్టుకొనేట్టు చెయ్యదు. కనీసావసరాల విషయంలో కొదువగానీ కరువుగానీ ఉండదు. అరణ్యన్యాయాన్నీ మాత్స్యన్యాయాన్నీ అమలుపెట్టదు. కాకులముగొట్టి గద్దలకు వెయ్యదు. గద్దలనే నిలవనియ్యదు. ధనస్వామ్యంతో పోల్చిచూస్తే, అది మనిషి అన్నవాడి పాలిటికి 'మహర్లోకమే', ఇంకా మాట్లాడితే 'సువర్లోకం'.

మరి అలాంటి వ్యవస్థను కూలదోసే ఉద్దేశంతోటిగానీ అందులో ఉండక తప్పని నెరసులను గోరంతలు కొండంతలుగా చూపడమే పరమాశయంగాగానే, రాసే గీసే కళాకారులకు భావస్వాతంత్ర్యం ప్రకటనాస్వాతంత్ర్యం ఉండనక్కర్లేదా? *Man does not live by bread alone* అన్నాడు ఒక తాత్వికుడు. ఆ *bread* లేకుంటే మనిషి బతకనేలేడు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను గూర్చిన గాలికబుర్లతో కడుపునిండదు సదరు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు మొదట ఆ *bread* లో ఉన్నై అలాగని, కళాకారుడు తన భావస్వాతంత్ర్యానికీ ప్రకటనా స్వాతంత్ర్యానికీ నువ్వులు నీళ్లు వదులుకోవలసిన అగత్యం లేదు సోషలిస్టు వ్యవస్థలో గూడా వ్యక్తికీ రాజ్యాధికారానికీ మధ్య వైరుధ్యాలు ఉండవచ్చునని మావో కూడ అంటాడు. అయితే, ప్రజలకూ ప్రభుత్వానికీ మధ్యగల వైరుధ్యాలు, వైషమ్యాలే కానక్కర్లేదు. అలాంటప్పుడు, కళాకారులకూ ప్రభుత్వానికీ మధ్యమాత్రం వైషమ్యం ఏందుకుండాలి? సమిష్టి శ్రేయస్సు ధనస్వామ్యంలో అల్పసంఖ్యాకులైన వాళ్ల ప్రయోజనాల కోసం హక్కులకు పరిమితులు విధింపబడితే. సామ్యవాద సమాజంలో అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాల కోసం విధింపబడడంలో ఆశ్చర్యంలేదు సాంఘిక అక్రమాల్ని సంస్థారూపంలో నిలబెట్ట గోరే ధనస్వామ్యం, సాంఘిక సమానత్వానికి

సంస్థారూపమిచ్చే సామ్యవాదం–పద్యవస్థలో తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు యధార్థమైన సాంఘిక ప్రయోజనం ఉంటుందో, కళాకారులు గమనించలేని విషయం కాదు. కాబట్టి ధనస్వామ్యంకింద తాము అనుభవిస్తున్నామని భ్రమపడుతూన్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాల దృష్ట్యా సోషలిస్టు వ్యవస్థలో కనిపించే లోపాలను ఎన్నడం, గొంగళిలో తింటూ ఆ వెంట్రుకలగురించి కళ్లుమూసుకొని ఉండడమే.

సోషలిస్టు సమాజం ఇంకా ప్రయోగదశదాటి స్థిరత్వంపొంద లేదు, పైగా, ప్రపంచమంతా అది వ్యాపించలేదు, దాని ఉనికి ఇప్పుడు బలపడి ఉన్నా, ప్రమాదాలు పూర్తిగా వైదొలగ లేదు ధనస్వామ్య వ్యవస్థ తాలూకు భావజాలం జగన్మోహినీ అవతారమెత్తి సోషలిస్టు దేశాలలోని అపరిణత మనస్సులనూ అడ్డదారుల మనుష్యులనూ ప్రలోభపెట్టగలుగుతూ ఉంది. చవకబారుతనానికే ఆకర్షణ ఎక్కువ, ప్రయోగపరత్వం పేరున క్షీణమాన వ్యవస్థతాలూకు అకటావికట దోరణులను "స్వేచ్ఛా ప్రపంచం" తాను ఆదరిస్తూ, ఆదరించని వాళ్లను వేలెత్తిచూపుతూంది. భావాల విషయంలో సహజీవనం (*Id ological co-existence*) గురించి రష్యాగానీ చైనాగానీ ఆమోదం చూపడం లేదంటే, తమ శుభ్రమైన సాంఘిక వ్యవస్థను సుస్థిరం చేసుకుందామనే. లెనిన్, స్టాలిన్, మావో సాంస్కృతిక విప్లవాన్ని అమలు జరిపాక, కలుపుమొక్కల్ని మళ్లీ మొలిపించి బలిపించేందుకు పిచ్చివాడో దుర్మార్గుడో తప్ప ప్రయత్నించడు.

అయితే. సోషలిస్టు వ్యవస్థ బలం దృష్ట్యానే, విమర్శను సహించడమేగాక భావవైవిధ్యాన్ని ప్రోత్సహించడమూ అవసరమే. వ్యవస్థను తొలిచి వెయ్యనంతమేరకు, విమర్శ విద్వేషపూరితం కానంత వరకు, వైవిధ్యం అవ్యవస్థకు తోడ్పడనంతవరకు, వీటిని సహించడంతోనే సరిపెట్టుకోకుండా నేరుగా ప్రోత్సహించేందుకు సోషలిస్టు ప్రభుత్వాలు పూనుకొనే రోజు వస్తుంది. ఈలోగా ప్రపంచంలో ఈ దేశాల బలం బాగా నిర్ణయాత్మకం కావలసి ఉంటుంది. అంతరంగిక ఉపద్రవాలుగానీ విప్లవప్రతిఘాతుక ప్రయత్నాలుగానీ లేకుండా పోవలసి ఉంటుంది. కళాకారుల మనస్సులనుంచి క్షీణ భావాలూ క్షుద్ర అభిరుచులూ వైదొలగవలసి ఉంటుంది. సోషలిస్టు వాస్తవం పట్ల గౌరవాభిమానాలు స్థిరపడవలసి ఉంటుంది.

పాస్టర్నాక్ ఉదంతాన్నో సోల్జెనిస్టిసిన్ ఉదంతాన్నో పేర్కొని రష్యాలోగానీ రష్యాలాంటి ఇతర సోషలిస్టు దేశాల్లోగానీ రచయితలకూ కళాకారులకూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు శూన్యం అనడం పాస్టర్నాక్, సోల్జెనిస్టిసిన్ సాహిత్యధోరణులనూ జీవితతత్వాన్నీ భావవైఖరులనూ విమర్శగా చూడకపోవడమే. సోషలిస్టు విప్లవాన్నే రోయించిందొకరు. స్టాలిన్ హయాం మొత్తంగా రాక్షసరాజ్యమని నిరూపించబోయింది

మరొకరు. తమ సమాజంలోని లోపాలను ఎత్తిచూపడంతో సరిపెట్టుకోలేదు వీళ్ళు. ఆ సమాజం పునాదినే సడలగొట్టబోయారు. వాళ్ళది సాహిత్యరూపం దాల్చిన రాజకీయ ప్రతిఘటనకాకుండా పోలేదు. గొప్పరచయితలే కావచ్చు. గొప్ప రచయితలు కావడం వల్లనే వాళ్లభావాలకుగల ప్రమాదకర శక్తిప్రభావాలు గొప్పవి. తమదేశంలో అధిక సంఖ్యాకులైన రచయితల నుంచి తాము కేటాబడిపోయారంటే, స్వయంకృతాపరాధమే. విదేశస్థులూ ధనస్వామ్య వ్యవస్థకు మారుపేరైన బూర్జువాలిబరల్ భావాలు గలవాళ్ళు— వీళ్ళేగాని, స్వదేశస్థులూ సోషలిస్టు వ్యవస్థలోనివాళ్ళు ఈ ఇద్దరికీ వత్తాసురాలేదు.

ఈరెండు ఉదంతాలేకాదు, అలాంటివి ప్రతి సోషలిస్టుదేశంలోనూ చాలా ఉన్నాయి. ఒక్కోసారి ప్రభుత్వాలూ రచయితల సంఘాలూ కళాకారుల విషయంలో అవసరమైనంతకంటె అధికంగానే కళ్ళెం బిగించడం జరక్కపోలేదు. 'సెన్సార్‌షిప్' నియమాలను అతిగా ప్రయోగించడంకూడా ఉంది. వైరుధ్యానికీ వైషమ్యానికీ మధ్య అంతరం ఎంచలేక, అధికార దుర్వినియోగం చెయ్యడంకూడా కొన్ని సందర్భాల్లో జరిగింది. రచయితలూ కళాకారులూ రాజకీయనేరస్థుల్లా ఘోరమైన శిక్షలకే లోను గావలసివచ్చింది. ఇవన్నీ అబద్ధమని చెప్పడం ఆత్మద్రోహం. పరిస్థితుల ప్రాబల్యం లెమ్మని దాటవెయ్యడంకూడా చిత్తశుద్ధి అనిపించుకోదు.

ఇటీవల క్యూబాలో ఇలాంటి ఒక ఉదంతం జరిగింది. హెబర్టోపాదిల్లా అనే కవిని అరెస్టుచేసి నిర్బంధించారు. అతనినేస్తం బెల్కిస్ కుజానికూడా. కారణాలు చెప్పలేదు. పాదిల్లా 1968 లో తన *Fuera del juego (out of Bounds)* అనే కావ్యానికి జాతీయకవిత్వ బహుమానం పొందిన కవి. అతను ఇప్పుడు ఆత్మ విమర్శ చేసుకొన్నాడు. అందులో, తన అహంకారాన్ని (*egocentrism*) నిందించు కొన్నాడు. పరుల పొగడ్తలకు ఉబ్బి తబ్బిబ్బైపోయానన్నాడు. విప్లవ ప్రతీఘాతుకమైన పొరబాట్లు చేశానన్నాడు. అలాంటి ఇతర రచయితలను తమ తప్పులు ఒప్పుకొని "రాజకీయ, నైతికపతనం" నుంచి తప్పుకోవలసిందిగా పేరుపేరునా అడిగాడు. పాశ్చాత్యదేశాల్లోని బూర్జువా మేధావుల్ని క్యూబాలోని కుహనావిప్లవ మేధావుల్నిదుయ్యబడుతూ, క్యూబన్ విప్లవాన్ని వ్యతిరేకించేవాళ్లను వెనకేసుకురావడం వాళ్లనేరమన్నాడు.

ఈ ఒప్పుకోలు (*confession*) అంతా బూటకమని, బలవంతాన ప్రభుత్వం పాదిల్లానుంచి దీన్నిరాబట్టి ఉంటుందని భావించి, ఝాపాల్ సార్త్, అతని భార్య సైమొనిదబోవార్ ప్రభృతులు ఒక ప్రకటనచేశారు. ఒకనాడు తాము ఏ విప్లవాన్నైతే

సమర్థించారో ఆ క్యూబన్ విప్లవమే ఇప్పుడు తప్పుదారిపట్టి పిడివాద అసహనం పాలౌతున్నదని విమర్శించారు.

ఫిడెల్‌కాస్ట్రో చూస్తూ ఊరుకోలేదు. మేధావులు విప్లవ ప్రతీఘాతుక చర్యలలో పాల్గొంటూ కూడా, ప్రత్యేక హక్కులు అనుభవిద్దామంటే అది వల్లకాదన్నాడు. మొత్తం క్యూబాజనాన్ని సృజనాత్మకంగా, కళాత్మకంగా మార్చే అవకాశాలు ఉన్నప్పుడు కొందరు మేధావులు తమకేదో ప్రత్యేకమైన విశిష్టమైన ప్రతిపత్తి ఉన్నట్లు భావించడం తప్పనిచెప్పాడు.

క్యూబన్ విద్యా, సాంస్కృతిక ప్రథమజాతీయ మహాసభ (1971) ప్రకటించిన పత్రిం చూస్తే, కాస్ట్రోవైఖరి బోధపడుతుంది.

From the very first moments, the Cuban Revolution enjoyed the Solidarity of the people the world over, and the most outstanding international intellectuals. But together with those who honestly understood the justice of the revolutionary cause and defended it, there were certain petty-bourgeios intellectuals, pseudo-leftists of the capitalist World, who used the Revolution to gain prestige with the people of the under developed world. These opportunists tried to penetrate here with their debilitating ideas, and to impose their fashions and tastes, and even act as judges of the Revolution.

ఈ కుహనా వామపక్ష మేధావులే, ఆదర్శ సోషలిస్టు రాజ్యమని వెనక తాము భావించిన క్యూబా ఇప్పుడు రచయితల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కాలరాచి వేస్తున్నదని పిచారం ప్రకటిస్తున్నారు. చెగువేరా మంత్రిగాఉండి కళావిషయాలలో నెలకొల్పిన ఉదారవైఖరి ఇప్పుడు పైదొలగుతూందని విలపిస్తున్నారు. గువేరా ఆశలుపెట్టుకొంది ఇలాంటి మేధావులను గురించిమాత్రిం అయిఉండదు. 21వ శతాబ్ది మనిషి రూపురేఖలగురించే గువేరా ధ్యాస. అందుచేతే గువేరా వారసులు ఈ మేధావులుమాత్రిం కాదు. పై ప్రకటనలో ఉన్నట్లు—

Culture in a Collectivist Society is mass activity, not the monopoly of an elite or the decoration of a chosen few or the free franchise of those with no roots in society.

ప్రజా ప్రయోజనాలకు అతీతంగా కళాకారుల ప్రయోజనాలేవో ఉంటాయను కోవడం పొరబాటేకాకుండా, సోషలిస్టు వ్యవస్థలో నైతికదోషమే కాకతప్పదు. తాము ఒక్కరే సమాజానికి అంతరాత్మలం అనేభావం కళాకారుల్ని ప్రజలనుంచీ వ్యవస్థనుంచీ వేరుపరుస్తుంది. అహంభావాన్ని కలిగించి తలతిప్పుతుంది,

Moscow 1937 అనే పుస్తకంలో లయన్ ఫ్యూష్‌వాంగర్ ఒకమాట అన్నాడు. "సోషలిస్టు వ్యవస్థను సాధించాలీఅంటే, ఈనాడు ప్రజాతంత్రం అనిపించుకొంటూన్న దాన్ని మార్చకతప్పదు. ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులకు తిండీ తిప్పలూ మట్టసంగా (కొద్దిగా)ఉండి, మీకు ఎక్కువ రచనాస్వేచ్ఛ ఉండాలంటారా, లేకపోతే వాళ్లకు తిండి తిప్పలు అధికంగా (ఎక్కువగా) ఉండి మీకు రచనాస్వేచ్ఛ తగ్గాలంటారా? రచయితలారా. ఈ రెంటిలో ఒకటి ఎంచుకొండి "

రాజకీయ స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం. వగైరా ఉండాల్సిందే. వాటన్నిటికీ పునాదిగా భౌతిక స్వాతంత్ర్యం ఉండాలి. అవ్వా కావాలి. బువ్వా కావాలి అనవచ్చు గాని, వాటిలో కొంతకాలమైనా దేనికో ఒకదానికితగ్గుదల ఉండవచ్చు. ఆ రెండున్నూ లేనిది ధనస్వామ్య వ్యవస్థ. సోషలిస్టు వ్యవస్థను విమర్శించేందుకు నైతికంగా దీనికి యోగ్యతే లేదు,

వచ్చే సంచికలో

పేబ్లో నేరూడాకు నోబెల్ బహుమతి

కె. వి. రమణారెడ్డి

## తెలుగు సినిమా

శ్రీశ్రీ

"ఫిలిం ప్రపంచం ఫిల్తీ" అని ఈ మధ్య నేనొక పత్రికలో వ్రాసినందుకు కొందరు సినీ జర్నలిస్టు మిత్రులకు కోపంవచ్చిందట! ఏం చెయ్యడం? యదార్థవాది ఎప్పుడూ బంధువిరోధి కాక తప్పదు. ఫిలిం ప్రపంచంలో ఎంత కుళ్ళు పేరుకుపోతోందో ఈ మిత్రులకుమాత్రం తెలియదా? తెలుగునాట ప్రతి ఊళ్ళోను పోస్టర్ల మీద అభిషేకాలు ఇందుకో చిన్న ఉదాహరణ మాత్రమే. నా ఒక్కడి అనుభవాన్ని బట్టి మాత్రమే చెప్పాలంటే పదేళ్ళ క్రిందట ఇదే సినీ ఫీల్డులో మోసం నూటికి 25 పాళ్లు నిజాయితీ 75 పాళ్ళు వుంటే, ఈనాడు నిజాయితీ 25 పాళ్ళు మోసం 75 పాళ్ళు ఉన్నట్లు తోస్తూంది.

మరి, ఇలాంటి ఫీల్డును ఇంకా నేనెందుకు అంటిపెట్టుకున్నానని కొందరు నన్నడగవచ్చును, అది సబబైన ప్రశ్నే! ఈ ఫిల్త్‌ను ప్రక్షాళనం చెయ్యగలనన్న నమ్మకం

ఏ కొంచెమో ఇంకా నాలో మిగిలివుంది, నాలాగ ఆలోచిస్తున్నవాళ్లు (అల్పసంఖ్యాకులే కావచ్చు) అనేకులీ ఫీల్డులో ఉన్నారని నాకు తెలుసు. రచయితలలో, డైరెక్టర్లలో, ఆర్టిస్టులలో, త ది త ర టెక్నీషియన్లలో ఎంతోమంది నాలాగే ఆవేదనపడుతున్న వాళ్లున్నారు. ఈ కుళ్లు వ్యవస్థ ఇలాగే ఉండిపోదనీ, ఇది మార్చడం సంఘటిత ప్రయత్నం ద్వారా సాధ్యమనీ నేనూ వీళ్ళూ నమ్ముతూండడం వల్లనే ఇంకా యీ ఫీల్డులో నేనున్నాను. సమాజంలో ఎలాగయితే సమూలమైన మార్పులురాక తప్పదో అలాగే ఫిలిం ప్రపంచంలోకూడా ఆశ్చర్యకరమైన పరివర్తనం అచిరకాలంలోనే వచ్చి తీరుతుంది. అందుకు మొదటిమెట్టు ఫిలిం పరిశ్రమ జాతీయం చెయ్యడం!

అలా చెయ్యడం వ్యక్తి స్వాతంత్ర్యానికి భంగకరం అని గోలపెట్టేవాళ్లున్నారు. ఎవరువాళ్ళు? ధనస్వామ్య వ్యవస్థకు మూలస్తంభాలుగా నిలిచి, స్వేచ్ఛా వ్యాపారం పేరిట కష్టజీవులను కొల్లగొట్టి అక్రమ లాభాలను ఆర్జించేవాళ్లు. పన్నులెగగొట్టేవాళ్లు, నల్లడబ్బు వెదజల్లేవాళ్లు. పరిశ్రమలో అట్టడుగున పడివున్న వాళ్లని పైకి రానివ్వకుండా అదిమిపెట్టి, వాళ్ళ రక్తాన్ని జలగల్లాగ పీల్చేవాళ్లు. సమాజ క్షేమానికి హానికరమైన వ్యక్తి స్వాతంత్ర్యానికి అర్థంలేదు అవసరమైతే రాజ్యాంగాన్నే సవరించి సమాజ క్షేమాన్ని సంరక్షించవలసిందే!

సినీమా కేవలం ఒక వినోదసాధనం కాదు, ధనస్వామికి లాభాలు కూర్చిపెట్టే జానపద మంత్రం కాదు, ప్రజాజీవితాన్ని కలుషితం చేసే విషగుళికలను భారీయెత్తున తయారుచేసే ఒక ఫ్యాక్టరీ కానేకాదు. అది ఒక మహత్తరమైన ఆయుధం. ఆరోగ్యం చేకూర్చగల ఔషధం. దీన్ని సంఘవిద్రోహుల చేతిలోంచి లాక్కొని ప్రజాయత్తం చేసినప్పుడే మనదేశం బాగుపడుతుంది. అప్పుడు ( సినీమా కథల్లోతప్ప మరెక్కడా కనిపించని ) సకల సుగుణాభిరాములైన హీరోలు వెండితెరనుంచి అంతర్థానమవుతారు. వాళ్ళతోబాటే వాళ్ళ నారాధించే దురభిమాన సంఘాలుకూడా రంగం నుంచి నిష్క్రమిస్తాయి.

అప్పుడే చలనచిత్రం నిత్యజీవిత వాస్తవాలను నిజంగా ప్రతిబింబించే అమోఘమైన, అపూర్వమైన దృశ్యకావ్య మవుతుంది.

( తెలుగు సినిమా వార్షిక సంచిక, అక్టోబర్ '70 సౌజన్యంతో )

వచ్చే సంచికలో

సినిమాల్లో అవినీతి

శ్రీ శ్రీ

కథ

# హా కుక్క

మరువాడ రాజేశ్వరరావు

ఆఫీసు దాటి వీధిలోకి అడుగు పెట్టగానే, గాలి చల్లగా తగిలింది, దూరంగా ఆకాశంలో కమ్ముకుంటున్న నల్లని మేఘాల గుంపు చూడగానే భయం వేసింది మేఘాల గుంపు అంచుల దగ్గర వెండిలాగ వెలిసి పోయింది, వెలిసిపోయిన అంచుల చుట్టూ బంగారు పూత పూసినట్టుంది. ఆ అంచులేకాక ఆకాశంవంకా నలుపెక్కి పోయేందుకు ఎంతోసేపు పట్టదనిపిస్తోంది కొద్దిసేపట్లో అంతా చీకటై పోతుంది ఉరుములు.... మెరుపులు.... వాన! తల తడిసి పోకుండా దాచుకోవాలంటే త్వరగా బస్సందుకోవాలి.

'పదగురూ....త్వరగా పద!'

పరిగెట్టినట్టు నడిచి బస్టాపు కెళ్తే పెద్ద 'క్యూ'!

క్యూలో నేనూ క్రిష్ణారావూ నిలబడ్డాం వెనకాతల క్యూ పెరిగి పోతోంది వానంటే అందరికి భయంవే .... ఇరవై నాలుగ్గంటల్లో పెనుతుఫాను రాబోతుందని పొద్దున్న రేడియోలో చెప్పేరు. చెప్పిపన్నెండు గంటలేనా కాలేదు! క్యూలో అంటూ నిలబడ్డాక మనం చేసేదేమీ లేదు కదా! అటూ, యిటూ చూడ్డంవే!

అటు చూస్తే కార్లు, (మనకి కాని) బస్సులు, రాబోయే వానకి భయపడుతూ పరుగులాంటి నడక నడిచే పెద్దలు, చిన్నలు, ఆడ, మగ....

ఇటు చూస్తే.... చూడాల్సిన విషయంవే!

ఏదో కొత్త సినిమా.... పోస్టరు!

పైట జారిపోతుంటే కొంటెగా చూస్తూ నవ్వుతున్న హీరోయిను .... మన వేపే చూసి నవ్వుతున్నట్టుంది,

చేతికేదో చల్లగా తగిలింది....

ఛీ! ఛీ! దరిద్రం!!

వాడి మొహం నిండా చీంవిడి బంక! వాడిలాగు, వొళ్ళు కూడా మురికి మురిగ్గా ఉన్నాయి. ఒక చేత్తోతుప్పు లాగున్న తల బక్కురుకుంటూ రెండో చెయ్యి ముందుకి చాచేడు.

"ఆకలేస్తంది బాబూ"

ఓ పక్క తుఫానొస్తుందని భయపడుతుంటే, మధ్యముసురులాగ వీడొకడు....

'ఆకలి వేస్తుంది ప్రతి మనిషికి ఆకలి వేస్తుంది అది ఆరోగ్య లక్షణంవే? వెళ్ళు శుభ్రంగా కావల (సింది) సినంత తిను, నాకు చెప్పడం దేనికి!'

ఇలాంటి జోకులన్నీ వేసేస్తే వాడికెలాగుంటుంది? వాడి ముష్టి చెయ్యి చూస్తే నాకూ అలాగే ఉంది. ముష్టి వెయ్యాలని పించ లేదు.

అసలెందుకు వెయ్యాలండీ?

నాదే ముష్టి బతుకు....తిండి లేదు బాబయ్యా. జీతాలు పెంచండి అని అడుక్కుంటే .. రెండురూపాయలు పెంచేరు. అందులో వీడికి వీర ముష్టా!

'లేదు పో' అన్నాను కాదు, కసిరేను.

వాడు పోకుండా క్రిష్టారావు దగ్గర చెయ్యి చాచేడు....ముసురు లాగ! వొదర్దే .. బస్సు కన్న ముందు వానే హొచ్చేసే లాగుంది.

క్రిష్టారావు, జేబులోంచి కొంత చిల్లరతీసి, అందులో వెతికి ఓరెండుపైసల బిళ్ల ఆ కుర్రాడిచేతిలో వేసేడు ... వెంటనే నావేవుతిరిగి ఓచిరునవ్వు నవ్వాడు...ఎందుకో!,

ఆ కుర్రాడు మరో అడుగు ముందుకేసేడు.

''పాపం!'' అన్నాడు క్రిష్టారావు.

వానొచ్చేస్తే బాగుణ్ణు. వానొచ్చేసి క్రిష్టారావు మొదలెట్టబోయే మహోపన్యాసం ఆగిపోతే...

''చూస్తే జాలేస్తోంది కదూ?''

అమ్మ బాబోయ్, క్రిష్టారావు 'జిడ్డు!' క్రిష్టారావు 'బంక!'... 'క్రిష్టారావు జిగురునే వాడండి' అని ఎవరేనా ఎడ్వర్టయిజ్ చేస్తే, అతన్నెరిగిన వాళ్ళంతా కొనేస్తారని గేరంటీ యివ్వగలను.

క్రిష్టారావు మాటకేంకాని, వానొచ్చేసేలాగుంది. మబ్బులు అంచులు మూసిపోతున్నాయి గాలి చల్లగా, వణుకులాగ తగుల్తోంది. వెలుగు కొద్దికొద్దిగా తగ్గిపోతోంది. ఈ వానలో తడవాలని రాసిపెట్టి ఉందికాబోలు! ....

క్యూలో క్రిష్టారావుముందు ఓ పాతికేళ్ళ యువకుడు నించున్నాడు. ఎడం చేతితో ఎర్రట్ట పుస్తకం. కుడిచేతి పొడుగాటివేళ్ళమధ్య సిగరెట్టు.... అతనూ ముష్టి కుర్రాడికేంవీ యివ్వలేదు. కుర్రాడు ముందుకి నడిచేడు.

''వాడెలా బతుకుతున్నాడో? పాపం''

''ఏదో అలాగే బతికేస్తాడులే''

—'ఇంకూరుకో' మన్నట్టుగా అన్నాను.

"అదీ బతుకేనా? చెరుకు పిప్పి చెరుకేనా? నువ్వూ నేనూ అలా బతకడాని కిష్టపడతాంవా? ....పైపెచ్చు వాడలాగేనా బతుకుతున్నందుకు నాలాంటివాళ్ళకి కోపం కూడానేమో? ..."

ముష్టి ఉపన్యాసం, వీడూను!

అయిదున్నరకే చీకటై పోతోంది.

గాలి విసురు ఎక్కువైంది. రోడ్డుమీది దుమ్ము, ధూళి, చెత్త, చెదారం గాలికి ఎగిరెగిరి, ఎగిరి పోతున్నాయి. అక్కడక్కడ దుమ్ము వలయాలు తిరుగుతూ, వింత వేషాలు వేస్తోంది.... జనం కళ్ళల్లో దుమ్ముకొడుతోంది.... నడిచేవాళ్ళ నడకల్లో ఆత్రుత ఎక్కువైంది, వానరావడం యింకెంతసేపు! ....ఈ లోగా బస్సొస్తుందా?

హీరోయిను బొమ్మవేపు మరోసారి చూసేను ... పాపం, దానిగుండెలూ, దాని చూపులూ, దాని నవ్వులూ దుమ్ముకొట్టుకు పోతున్నాయి ...

"అయితే ఏఁవిటి మీరనేది?"

కృష్ణారావు ముందు నించున్నాయన సిగరెట్టుపొగ సన్నగా వదుల్తూ అన్నాడు.

"మనక్కలిగిందాన్నిబట్టీ దాన చెయ్యాలండీ! వాడితోపోలిస్తే మనఁ వెన్నిరెట్లు మెరుగ్గా బతుకుతున్నాఁవో! ... అంటే, వాడికి జరిగిన అన్యాయాన్ని మనఁవంతగా అనుభవిస్తున్నామన్నమాట ... వాడిమీద జాలిపడి సాయంచెయ్యడం మన నైతిక బాధ్యత! ... అడుక్కోవడం వాడిఃహక్కు!"

కృష్ణారావు వాగ్ధాటి పెరిగిపోతోంది. అతను చెప్పిందంతా విని,—

'నువ్వు దొంగవా, అమాయకఁడివా?' అన్నట్టు చూసేడతను.

రవి .. కవి... అవునవును. అతనిపేరు రవి. అతను కవిత్వం రాస్తాడు. గుర్తొచ్చింది! ఎవరో, మరెవరికో అతన్ని పరిచయంచేస్తుంటే విన్నానెప్పుడో!

కృష్ణారావుతప్ప యింకెవరూ ముష్టికుర్రాడిమీద జాలిపడినట్టులేదు. పసుప్పచ్చని సిల్కుచొక్కా, మల్లుపంచె తొడుక్కున్న కళ్ళజోడు పెద్దమనిషి వాడ్ని కసురు కున్నాడు.

'హక్కు'ట!

నా ముప్పైయ్యేళ్ళ జీవితంలోనూ ఎంత తరుచుగా వింటున్నానో అంతగా అర్థం కాని మాట... హక్కుఅంటే ఏఁవిటో, ఎక్కడ, ఎందుకు పుడుతుందో...

'అయిదు రూపాయల జీతం పెంచమని కోరడం మా హక్కు!' అంటూ స్ట్రైకులు.... .... అయిదూ పెంచేస్తే 'హక్కు' గెల్చేసుకున్నట్టే కద! మరో అయిదు

రూపాయలకి 'హక్కు' త్వరలోనే పుట్టేస్తుంది.... ముష్టెత్తుకోడం హక్కు! పని చెయ్యడం హక్కు! ఆడదానికి కళ్ళంట నీళ్లపెట్టుకునే హక్కు! ఆడదానిమీద అధికారం— మొగవాడి హక్కు! దేశంలోని మొగాళ్ళనందర్నీ నపుంసకుల్ని చెయ్యడం— ప్రభుత్వం హక్కు! ప్రభుత్వానికి వోటు వెయ్యడం— ప్రజల హక్కు! ఒక మనిషిని 'మాల'వాడ్ని చేసి, —గుడిలోకెళ్ళే హక్కు!.... ఈహక్కులు సాధించుకోడానికీ, బతుకులు బాగుపడ్డానికీ ఏఁవీ సంబంధం లేనట్టుంది.... మనకెందు కొచ్చిన గొడవ!

... పక్కనించే వెళ్ళిపోతున్న అమ్మాయి నడక... నా ఆలోచనలకి బ్రేకు!

ఆ నడకలో విసురు.... నా గుండెల్లో ఎక్కడో జివ్వున లాగింది ... గాలికి పైటచెంగు ఎగుర్తోంది....

"పైసా నఁహీఁమిలేగా! ఏక్ ధప్పడ్ మిలేగా.... ఆఁ.... హాఁ!" తల ఎగ రేస్తూ, చేతులుతిప్పుతూ అంటున్నాడో హిందుస్థానీయుడు. యజమానులంతా యిలాగే అంటారు. ఉద్యోగులు ఆ కుర్రాడిలాగే ఆకలిపొట్ట చూపిస్తూ బతిమాలుతూ ఉంటారు. ....'హక్కు!'

"హోరి కర్కోటకుడా!" అని గొణుగుతున్నాడు కృష్ణారావు.

ఇలాంటి 'హక్కు'ల్ని క్రిష్ణారావెందుకు ప్రోత్సహిస్తాడో...? ముష్టివెయ్య డంలో మానవత్వం, అడుక్కోవడంలో న్యాయం కనిపిస్తాయతనికి.

.. చప్పుడులేకుండా వెనక్కిపడ్డాడు ముష్టికుర్రాడు. డొక్కలోతాపుతిన్న కుక్క లాగ. అచ్చు అలాగే! అలాగరవలేదంతే.

"లంజాకొడకా?" అన్నాడాకార్యానికి కర్త, చాలా కోపంగా .. తడిసిన దుక్క ముక్కలాగ నల్లగా, బరువుగా కనిపిస్తున్నాడు. అలాంటివాళ్ళని చూసినప్పుడల్లా నాకు పోలీసులే గుర్తుకొస్తారు.

అట్నించి చూపులు తిప్పేసుకున్నాడు కృష్ణారావు.

"మానవత్వం" అంటూ గొణుగుతున్నాడు, పాపం క్రిష్ణారావు!

ముష్టికుర్రాడి వేపుచూసేను. వాడికళ్ళల్లో నీళ్లనిండేయి. అప్పటికే చాలామంది 'లేదం'టూ కసిరేసేరు. ఎన్నికసుళ్లు తినగలడు? లెఖ్ఖవేసేను. అప్పటికి రెండు పైసలకి, ఏడు కసుళ్ళుతిన్నాడు. చివర్ని ఓతాపు... ఇంకా ఎన్ని 'లేధు'లు విన్నాక మరోపైస రాల్తుందో?...

తప్పదు. 'హక్కు'ని 'అడుక్కునే' వాడిగతి అంతే! రోజుకో స్ట్రైకు... ఎన్నేళ్ళు!... శాంతియుతంగా స్ట్రైకులుచేసే వాళ్ళనికూడా పోలీసులు తంతారు..., ఆ దుక్కముక్కలాగే!

ఆ కుర్రాడి చెయ్యెత్తగలగానే. చొక్కాజేబు, పంట్లంజేబూ రెండు చేతుల్తోనూ బిగించి పట్టుకుని గాభరాగా చూసేడో పరధ్యానం గాంధీటోపీ .. అందరూ నవ్వేరు.

"ఛో!... ఛో!" అని కీచుగొంతుకతో అరిచేడతను.

ఏదో వాసనచూస్తున్న ఊరకుక్క పారిపోయింది. ఆకుర్రాడు కళ్ళనీళ్ళు నింపుకుని ఇంకా అలాగే నిలబడ్డాడు.

జేబులమీంచి చేతులుతీసేస్తూ మరోసారి అరిచేడు గాంధీటోపి.

"ఓ పక్క వానొచ్చేస్తోంది. ఈ బస్సెంతకీరాదు" అన్నాడో బక్కపేగు.

గాంధీగారి 'చిరంజీవి'త్వాన్ని గురించి ఏదో చెప్తున్నాడు కిృష్ణారావు- ఆతని ముందున్నాయన... రవి!... వింటున్నాడు.

"గాంధీగారి బదులు భగత్సింగు చిరంజీవి అయితే 'హక్కు'కి వేరే అర్థం చెప్పుకునేవాళ్ళం" అన్నాడాయన.

కిృష్ణారావు ఏదో చెప్పబోతూ, ...ఠక్కున ఆగిపోయాడు! కొంచెం వొంగోడానికీ, ఎవరి చాటునేనా నక్కడానికీ ప్రయత్నిస్తున్నట్టనిపించింది. ఎందుకో...రోడ్డుమీద ఎందరో తిరుగుతున్నారు. ఎవర్ని చూసి భయపడుతున్నాడో అర్థంకాలేదు.

కాసేపయేక నిఠారుగా నిలబడ్డాడు మళ్ళీ...

యుద్ధభేరీలు వాయిస్తున్నట్టు ఉరిమింది ఆకాశం! మేఘాల్లో మెరుపు మెరిసింది. కాసేపు కళ్ళు చీకట్లుకమ్మేయి. కొంచెం తెరిపిచిక్కేక, కృష్ణారావు రోడ్డుమీద ఎవర్నో చూపిస్తున్నాడు.

అతను నల్లగా ఉన్నాడు పొడుగ్గా ఉన్నాడు. బలంగా ఉన్నాడు. ఠీవిగా, నిర్భయంగా నడుస్తున్నాడు, వానొస్తుందనే భయంలేనట్టు నడుస్తున్నాడు. భయపడే వాళ్ళు భయపడండి అన్నట్టు యిటూ, అటూ చూస్తూనడుస్తున్నాడు.

మేఘాల అడవుల్లో మరో మెరుపు మెరిసింది. బాంబులు పేల్తున్నట్టు ఉరుములు.

"అతన్నిచూచి నువ్వు దాక్కోవడం దేనికి?" అన్నాను.

"వాడు నాకుతెలుసు"

తెలిస్తే?...

"చాలా డేంజరస్"

చూడ్డానికలాక్కనిపించడం లేదుమరి!

"విప్లవం కావాలంటాడు...అబ్బే! నాకిప్పుడతన్తో ఏ సంబంధమూ లేదనుకో!... పియ్యూసీవరకూ నాక్లాస్‌మేట్, ఈ మధ్యనే విన్నాను... అతను విప్లవం కావాలంటు

న్నాడు... అంటున్నాట్ట! నాకు సరిగ్గా తెలీదనుకో... అయినా, చూస్తే పలకరిస్తాడని... నేనోసారి విన్నానులే. కూలివాళ్ళ మీటింగులో మాట్లాడుతూ, 'కేవలం ప్రాణాలతో కాక, మనుషుల్లా బతికే హక్కు సాధించుకోండి', అన్నాడు. అంతటితో ఊరుకున్నాడా? 'అందుకు అడ్డుతగిలేవాళ్ళ ప్రాణాలుతీసినా తప్పులే'దన్నాడు... అమ్మో, మనకెందుకులే వాడితో అని!..."

కృష్ణారావు కొంచెం వొణుకుతున్నట్టు నాకనుమానం,

"అయితే నీకెందుకుభయం? నీ ప్రాణాల్తీసేడు కదా?"

"అబ్బే! అతనుకాదు. పోలీసులు చూసేవూ?.. చాలాప్రమాదం...యిలాంటి వాళ్ళని ఎక్కడో అడవుల్లోకి తీసుకుపోయి కాల్చేస్తారట! .. నాకు పరిచయం ఉందని తెలిస్తే..." పెర్వస్‌గా నవ్వేడు క్రిష్ణారావు.

కొండల్లాంటి మేఘాలు ఉరుములతో అదిరిపోతున్నాయి. విసురుగా వీస్తున్న గాలి... రోడ్డుమీది దుమ్మునీ ధూళినీ తుడిచిపెట్టేస్తుంది. ప్రళయంలాగ... తుఫానొచ్చేస్తోంది.

"మనుషుల్లా బతికే హక్కు!...

కృష్ణారావు, హక్కుల్నీ హక్కుదారుల్నీ సమర్థిస్తాడే! మరి ఈ హక్కు ...ఇదంటే భయపడుతున్నాడు. ఈ హక్కుదారుల్ని... పోలీసులు కాల్చేస్తారంటున్నాడు. హక్కంటే?... ముష్టి?... పోరాటం!

"హక్కంటే ఏఁవిటోయ్, క్రిష్ణారావ్?"

"ఆఁ, అదే! దాని గురించే చెప్పబోతున్నాను మేష్టారు..."

కృష్ణారావు ముందునుంచున్నాయన... రవి. ఏదో చెప్పతుంటే,-

మరో మెరుపు...

టపటపా చినుకులు రాలేయి.

బస్సు రాకుండానే వానొచ్చేసింది.

కృష్ణారావు, రెండుచేతులూ నెత్తిమీద పెట్టుకుని నావేపుగా భరాగా చూసేడు.

వాన పెద్దదైపోతోంది. తలదాచుకోడానికి అందరూ అటూ, యిటూ పరిగెడుతున్నారు. కృష్ణారావు గాభరాగా ఎటో పరిగెడుతూ... దారిలో చూసుకోకుండా ముష్టి కుర్రాడ్ని గుద్దుకున్నాడు. వెల్లకిలా పడిపోయిన ముష్టి కుర్రాడ్ని... ఆ గాభరాలో మట్టీసుకుంటూ పరిగెట్టేడు క్రిష్ణారావు... ఆ క్షణంలో అతనికి మానవత్వంకన్నా, తలదాచుకోడఁవే ముఖ్యమైపోయింది!

పరిగెట్టడం వేగాని, కనుచూపుమేరలో, ఎక్కడా తలదాచుకోవడం సాధ్యపడదని తెలుసుకొనక వానలోతడుస్తూ అలాగే నిలబడిపోయేను. క్యూలో రవీ, నేనూ మిగిలేం.

"నేచెప్తున్న దేంవిటంటే .."

వరదొచ్చినా, తుఫానొచ్చినా తను చెప్పదల్చుకున్నది చెప్పేతీరుతానన్నట్టున్నాడతను

హక్కు గురించండి!.... హక్కంటే ఏంవిటి? మనకి న్యాయంగా రావలసిందాన్ని హక్కంటాం. మనకి న్యాయంగా చెందవలసిందాన్ని అన్యాయంగా దోచుకుని యింకొకడనుభవిస్తుంటే, 'బాబ్బాబు, మాది మాకిచ్చీరా' అని బతిమాలితే యిచ్చేస్తాట్టండీ? యివ్వడానికా వాడు దోచుకున్నాడు? కావలిస్తే ముష్టెత్తుకోమంటాడు. మనం ముష్టెత్తు కోడానికొప్పేసుకుంటే, వాడి అన్యాయం న్యాయంవై పోతుంది. అందుకే ముష్టి వేస్తానంటాడు వాడు. మనకి ముష్టెత్తుకునే ఖర్మేంవిటండీ? మీ జేబులోంచెవడేనా పది రూపాయలు కొట్టేసి మీకు పది పైసలు ధానం చేస్తానంటే ఒప్పేసుకుంటారా చెప్పండి? మీ పది రూపాయలూ వాడ్ని తన్ని లాక్కోడంవే కాకుండా, దొంగ పని చేసినందుకు వాడ్ని శిక్షించాలంటారు. అవునా, కాదా? అంటే దగుల్బాజీ వాణ్ని తన్నాలిగాని, బతిమాలకూడదు, మరి ఈ సంపదలూ, ధాన్యాలూ, మేడలూ, వాహనాలూ రోడ్లూ యివన్నీ జనం కష్టపడి పనిచేస్తే వొచ్చేయా? లేక, వాడెవడో రూపాయి నోట్ల వర్షం కురిపిస్తే వొచ్చేయా? అయితే కష్టపడే వాడెక్కడున్నాడండి? రోగాల్లోనూ, రొచ్చులోనూ, బురధలోనూ, దరిద్రింలోనూ కూరుకుపోయి ఉన్నాడు. రూపాయల వర్షం కురిపించినవాడో? మేడల్లోను, కార్లలోను, కులాసాల్లోను ఖుషీగా ఉన్నాడు. కష్టపడ్డవాళ్ళ కడుపులు నిండడానికీ, మేడల్లో వాళ్ళని కిందకి దించడానికీ ఏం చెయ్యాలండీ? ముష్టెత్తాలా? కత్తులు నూరాలా? కత్తులు నూరాలండీ! తుపాకులు, బాంబులు పట్టుకోవాలి. భగత్సింగ్ ముష్టెత్తాడా? తుపాకి పట్టుకొన్నాడు. గాంధీ ముష్టెత్తి సంపాయించిన స్వాతంత్ర్యం ముష్టి స్వాతంత్ర్యంలాగే ఉంది...యిందాక వెళ్ళినాయన,... ఎవరో తెలుసా? కిృష్టారావుకి పరిచయం ఉందికాని, అతని గురించేంనీ తెలీదు. నాకతన్తో పరిచయం లేదు, అయినా, అతన్ని గురించి నాకు తెలిసింది చెప్తాను వినండి.. అతను నిప్పులాంటి వాడండీ! నిప్పులాగ మండుతున్నవాడు నిప్పులాగ జనాన్ని మంచిస్తున్నవాడు నిప్పులాగ శతృివుని కాలుస్తాడు, ఉన్న ఉద్యోగాన్ని, పెళ్ళాం పిల్లల్నీ, తల్లి దండ్రుల్ని సుఖాన్ని వొదులుకొని జనం మధ్యకి వెళ్ళిపోయేడంటీ! పాృణాలకి తెగించి వెళ్ళిపోయేడు, ఎందుకు? ముక్కు మూసుకుని జపం చేయడానిక్కాదు. స్వర్గం కోసంవూ స్వర్గంలో రంభ కోసంవూ కాదు. జనంతో కలసి, అన్యాయాన్ని ఎదిరించడానికి వెళ్ళేడు. జనాన్ని బతుకు వెలుగులోకి పోరాటంద్వారా

నడిపించడానికి వెళ్ళి పోయేడు. జనానికేదో సేవ చేద్దామనా, ఏదో త్యాగం చేస్తున్నాననుకునా కాదు. అతని జీవితానుభవంలోంచి, జీవితాన్నితను అర్థంచేసుకున్న తీరుని బట్టీ అంతరాంతరాల్లో తోచిన అవసరంవల్ల వెళ్ళేడు. హక్కుని అర్థం చేసుకున్నాడు కనక, పోరాటం ద్వారానే ఆ హక్కుని సాధించుకోవలసిన అవసరం తెలిసింది కనక వెళ్ళేడు, అతను సాధిస్తాడండీ! జనం అతని వెంట నడిచి, సాధించుకుంటారు!"

అతని ఉపన్యాసం వింటున్నంతసేపూ వానపడుతున్నా, చలివెయ్యలేదు.

అల్లంత దూరంలో రోడ్డుకొసాని,—

గాలినీ, వర్షాన్నీ చీల్చుకుంటూ, దూరంగా వొంగిన ఆకాశంలోకి...

ఆకాశంలోని మేఘాల కొండల్లోకి... అదృశ్యమైపోయేడు, 'అతను!'

అక్కడో మెరుపు మెరిసింది.

---

జనవరి సంచిక కథల సంచిక

విప్లవకథ కొన్ని సమస్యలు, సూచనలు, ఆలోచనలు :

కొడవటిగంటి కుటుంబరావు, కృష్ణాబాయి, మరువాడ రాజేశ్వరరావు

నర్తోడు కథ శ్రీపతి

కథల్లో యిపుడు వీస్తున్న న్యూవేవ్ సమీక్ష

సమీక్షలు :

# దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు?

దేవాలయాల మీద బూతుబొమ్మలు కనిపించినప్పుడల్లా బి.ఎ లు, ఎం.ఎ. లు ప్యాసయిన మన విద్యావంతులుకూడ దేవుడు పనేదో అయిందనిపించుకొని మళ్ళీ మళ్ళీ వాటికోసం వెతకడం తప్పితే ఏమిటీ అఘాయిత్యం అన్న ప్రశ్న జనించదు. మనచదువులన్నీ తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం కావడంనుంచే హేమాహేమీలు కూడ బాబాలకు భజనలు చేయడం చూస్తున్నాం. అక్షరాస్యతలోనే కాదు, అజ్ఞానంలో కూడ మనదే ఫస్టు ప్రైజు. ఇలాంటి వాతావరణంలో నలభై ఏళ్లకి పూర్వమే కనీసం విద్యాధికులకైనా విచక్షణా జ్ఞానం కల్పించాలని కృషిచేసిన కొద్దిమంది మేధావులలో తాపీ ధర్మారావుగారు అగ్రిగణ్యులు. కొమ్ములు తిరిగిన పండితులకు దీటైన సాహిత్య జ్ఞానాన్ని విజయ విలాస వ్యాఖ్యలో ప్రదర్శించిన తాపీవారు అభ్యుదయపరులు కావడం నుంచి మతం సనాతనధర్మం పేరుతో స్వార్థపరులు అర్థరహితమే కాకుండా యీనాడు అసభ్యమైన పూజలు, పునస్కారాలు నెలకొల్పి ప్రజాబాహుళ్యాన్ని ఎలా మోసగిస్తున్నారో సుప్రసిద్ధమైన పై గ్రంథం ద్వారా నిరూపించేరు. ఆ రోజుల్లోనే ఆంధ్రదేశంలో మహత్తర సంచలనం కలిగించిన ఈగ్రంథాన్ని అసంఖ్యాకమైన విద్యావంతులు నూతన పాఠకులు లభిస్తున్న యీనాడు తిరిగి ప్రచురించడం ముదావహమైన విషయం. విజ్ఞానశాస్త్రం వికసించక పూర్వం ఆదిమ మానవులు ప్రకృతిని అర్థంచేసుకోలేని పరిస్థితిలో సృష్టికార్యమే ప్రపంచానికి మూలసూత్రమని భావించడం నుంచి స్త్రీ పురుష సంయోగాన్నే పవిత్రకార్యంగా పరిగణించి గుహ్యేంద్రియాలకే అవ్యక్తమైన దైవత్వం అపాదించడం జరిగింది. తద్వారా ఆహారధాన్యాల వుత్పత్తి వర్ధిల్లుతుందని కూడ భావించేవారు. మానవజాతి చరిత్రనుగూర్చి తెలుసుకున్నవాళ్ళకీవిషయం విదితమేకాని ప్రజల్లో అజ్ఞానం యింకా ప్రబలిన మనదేశంలో యింకా లింగపూజ, కామక్రియపై ఆధారపడిన యజ్ఞాలు మున్నగు సనాతనాచారాల అంతరార్థం చాలామందికి తెలియదు. తెలిసి ఉండికూడ పండితమ్మన్యులు వాటిని సమర్థించడం యింకా హాస్యాస్పదం. అశ్వమేధయాగం గురించి గొప్పగా పసిపిల్లలకు పాఠాలు చెప్పుతున్నారంటే మనవిద్యావిధానం ఏస్థాయిలో ఉందో తెలుస్తుంది.

తాపీ ధర్మారావుగారి గ్రంథంద్వారా అసలు కోవెళ్లు ఎలా ఉద్భవించాయో, పండుగనాడూ పాతమొగుడేనా అన్నసామెత ఎలాపుట్టిందో యీరోజు పవిత్రబంధంగా

మనం భావిస్తున్న వివాహ వ్యవస్థకు పూర్వం విశృంఖల కామజీవితం సామాన్యధర్మం గాను పైగా పవిత్రకార్యం క్రింద ఎలా పరిగణింపబడిందో పాఠకులు తెలుసుకోగలరు. సాంఘికాచార వ్యవహారాల గురించి విశ్వవ్యాప్తంగా ఎంతటి వైవిధ్యం కనపడుతుందో అనేక ప్రామాణిక గ్రంథాలను మథించి వాటిలోనిసారాన్ని సామాన్యపాఠకుల కందించ డంలో తాపీవారు కృతకృత్యులయారు. వారిని గొప్ప పండితులనడం నాకిష్టంలేదు. పండితుడన్నపదానికి తా పీ వా రు నిరూపించిన అర్థంతెలిస్తే అంతకన్న అపచారం మరొకటిలేదు.

తాపీవారి గ్రంధాలకు యీనాడు యితోధికమైన ప్రచారం కల్పించడం అభ్యు దయ పరుల కర్తవ్యం, మూఢ విశ్వాసాలు, పాతరాతియుగంనాటి ఆచారాలు ప్రజల్లో పాతుకుపోవడంనుంచి తిరుపతి ముడుపుల్లో సగండబ్బు దొంగసొమ్ము అనుకున్నా సాలీనా అమాయకుల ప్రజల కష్టారితం రెండువందల కోట్ల రూపాయలు మఠాలకీ, కోవెళ్లకీ, బాబాలకి చేరుతున్నట్లు బాబూరావు పటేల్ అంచనా. ఇటీవల తిరుపతి దేవస్థానం నలభైవేల రూపాయలు అక్కడ జరగబోయే యజ్ఞం ఖర్చులకి విరాళము యిచ్చింది. ఆవునెయ్యిని అగ్గిపాలుచేయడం సంగతి దేవుడెరుగు యజ్ఞం అంటే ఏమిటో మన ప్రజలు తాపీవారి పుస్తకంద్వారా తెలుసుకోవడం మంచిది.

తాపీవారి గ్రంధంలో కొన్ని లోపాలు లేకపోలేదు, అభ్యుదయ ఉద్యమానికి అమోఘమైన సేవచేసిన ప్రముఖ మేధావి కృషిని కించపరచడానికి కాక పాఠకులు తాపీవారి గ్రంధాన్ని ఏ దృష్టితో అర్థంచేసుకోవాలో సూచించడానికీ యిటుపైని మన సాంప్రదాయాలను విమర్శించే గ్రంధాలు రాయదలచుకుంటే ఏలాంటి దృక్పధం అవ లంబించాలో వివరించడానికీ తాపీవారి గ్రంధంలోని లోటుపాటులగురించి ప్రస్తావించడం సమంజసం. మొట్టమొదటి సందేహం వారిగ్రంధం ఎవరినుద్దేశించి రాసింది అనూ హ్యం. మేధావులకోసం శాస్త్రగ్రంధం రాయదలచుకొంటే అంతటి తేలికైన ధోరణి అప్రస్తుతం. సామాన్యపాఠకులకోసం రాస్తే ఆదిమకాలంలోని ఆచారవ్యవహారాలను వివరించి నప్పుడు వాటినెలా అర్థంచేసుకోవాలో, యిలాంటి పరిశోధనలవల్ల సాంఘి కాభ్యుదయం కోసం ప్రజలు నేర్చుకోవలసిందేమిటో సూచించవలసి ఉంటుంది. పిండి వంటలకి ఫ్రాయిడిస్టు వ్యాఖ్యానాలివ్వడం గారెకిమధ్యలో కన్నం దేనికని చర్చించడం అష్టావధానిని అడగవలసిన ప్రశ్నలు. (సైంటిఫిక్ రీజన్సు నేనివ్వగలను) అలాంటి అతిశయోక్తులు అసలు ఉద్దేశ్యానికి భంగంకలిగిస్తాయి ఈ గ్రంధం రాయడంలో తాపీవారు సాధించదలచిందికాని అభ్యుదయపరులు నేర్చుకోదగ్గదికాని ఏమిటి? మతం, అసత్యమైన విగ్రహారాధనద్వారా ప్రజలు మోసపోతున్నారనీ చారిత్రికంగా ఎన్నో

మార్పుల పరిణామంగానే యీనాటి వివాహ వ్యవస్థ ఏర్పడిందని, మంత్రాలలోను మంగళసూత్రంలోను ప్రత్యేకమైన పవిత్రత ఏమీలేదనీతెలుసుకోవాలి ప్రజలు. అందువల్ల ఆధునిక యుగానికి అనుగుణ్యంగా మన సాంఘికవ్యవస్థ యింకా మారవలసిన అవసరం ఉందని నిరూపించాలి. పైవిధంగా ఆలోచిస్తే తాపీవారి గ్రంథం అటువంటి అవగాహన అందిస్తుందా అంటే లేదనే నా అనుమానం.

**తాపీవారి గ్రంథంలో** మన ప్రాచీన సంస్కృతినుండి యిచ్చిన ఉదాహరణలు **తక్కువ.** మారుమూలదేశాలజోలికి పోనవసరంలేదు. చాలావిషయాలు మనం **భారతం,** పురాణాలనుండే ఋజువు చేయవచ్చును. ఆ విధమైన యత్నమే మరింత ప్రయోజనకరం. పైగా దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు అన్న చర్చలో రక రకాలైన అంశాలు గజిబిజిగా క్రోడీకరించడం జరిగింది. లింగపూజ ఎలావచ్చింది అనేది ముఖ్యమైన ప్రశ్న. కోవెళ్ల విషయంలో యీనాటి దేవాలయాలు మధ్యయుగంలో కట్టినవిగాని పురాతనమైనవి కావు. ప్రాచీనకాలంలో కోవెళ్లు ఉండేవా అనికూడ అనుమానం. ఇక ఖజురాహోవంటి దేవాలయాల్లోని బూతుబొమ్మలు తాంత్రికమతానికి చెందినవని ముల్క్‌రాజ్ ఆనంద్‌వంటి కళావేత్త విశదీకరించాడు. మతంలో కామ ప్రవృత్తి అనేదికూడ రెండువిధాలు. మతంలో సమ్మిళితమైనది వేఱు. మతానుచరుల అవినీతివేఱు. ఉదాహరణకు దేవదాసీలవంటి వెస్టల్‌వర్జిన్స్‌రోమ్‌లో ఉండేవారు. కాని వారిలో అవినీతిపరులు అత్యల్పం. తాపీవారి గ్రంథంలో సమగ్రదృష్టికాని చారిత్రిక దృక్పథంగాని కనపడదు. దేవాలయాలన్నీ శోభనపు గదులనీ, మతం యావత్తూ బూతుమయం అని చిత్రించడం అతిశయోక్తి అవుతుంది. వేర్వేరు మతాలు వేర్వేరు పరిస్థితులలో ఉద్భవించాయి. హిందూ యిజమ్‌లో కామం పాలు ఎక్కువకావడానికి కారణం అతిప్రాచీన మతంకావడం నుంచే. మన సాంప్రదాయాలను విమర్శించేముందు హైందవ నాగరికత వివిధ దశలద్వారా చారిత్రిక పరిణామం చెంది యీనాటి ఆచార వ్యవహారాలు ఏర్పడ్డాయని మన ప్రజలకు విశదీకరించవలసి వుంటుంది.

సింధు నాగరికతలో శైవమతం ఆరంభదశలో కనపడుతుంది. కాని దేవాలయాలు ఉన్నట్లు ఆధారాలులేవు, క్రమేణా శైవాన్ని ఆర్య సాంప్రదాయంలోకి చేర్చుకోవడం జరిగింది. ఉపనిషత్తుల కాలానికి మరికొన్ని మార్పులు సంభవించాయి. బౌద్ధయుగంలోనే విగ్రహారాధన, దేవాలయాల స్థాపన జరిగినట్లు విజ్ఞుల అభిప్రాయం, బౌద్ధం క్షీణించేకనే పురాణాలు బయలుదేరి యిప్పుడున్న హిందూమతం ఏర్పడింది. కర్మకాండకి ప్రాధాన్యతనిచ్చిన మీమాంసావాదంకూడ అప్పుడే వర్ధిల్లింది, ఒకవైపున యిలాంటి పరిణామం జరుగుతున్నప్పుడు తాంత్రిక మతం హిందూ, జైన, బౌద్ధ

మతాలన్నిటినీ తన పరిధావంలోకి తెచ్చుకుంది. నరాతకీ శైవమతానికి తంత్రానికీ చారిత్రికాను బంధం ఎలాంటిదో తెలియదు. ఏమయినా తాంత్రిక సాంప్రదాయాలను తత్త్వశాస్త్రం స్థాయిలో అర్థంచేసుకోవాలికాని కేవలం లైంగికవాంఛ తీర్చుకుందికే (అతి ప్రాచీనకాలం వేఱు) వారి సిద్ధాంతాలు బయలుదేరాయి అనడం భావ్యంకాదు. పైవిషయా లన్నిటినీ వివరించడం తమ గ్రంథం ఉద్దేశ్యం కాకపోవచ్చు. కాని పీఠికలోనైనా సూచిస్తే బాగుండేది. చారిత్రికదృష్టితో లోతుగా ఆలోచించడానికి మేధావులకు ఎక్కువగా ఉపయోగపడేటట్లు తాపీ వారి గ్రంథం నాకు కనిపించలేదు. మరోవిషయం. ప్రస్తుతానికి ఉద్దేశపూర్వకంగానే సెక్సుకి కళకుగల ప్రగాఢమైన అనుబంధాన్ని గూర్చి చర్చించదలచుకోలేదు. రామప్పంతులు చెప్పినట్లు అదివేరేకథ.

తాపీవారి గ్రంథంలోని పైలోపాలమాట అటుంచి మన సాంప్రదాయాలను విమర్శించినప్పుడు లింగపూజ, అశ్వమేధయాగంలోని అశ్లీలంకన్నా ముఖ్యమైన విషయాలపై అభ్యుదయపరులు ఆలోచించవలసి ఉంటుంది. హిందూయిజంలోని ప్రధాన లోపం ఆల్బర్ట్ షైట్జర్ (Albert Schweitzer) సూచించినట్లు మానవత్వం లేకపోవడం. నైతికజీవితంలో బాధ్యతారహితమైన నిర్లిప్తత హిందువుల సామాన్యలక్షణం. మన తత్త్వశాస్త్రంలో మేధతప్పితే హృదయమనేది శూన్యం. ధార్మికదృష్టి, సత్ప్రవర్తనగూర్చి ప్రస్తావించడంగూడ కేవలం స్వార్థంతోగూడిన వ్యక్తిగతమైన మోక్షసాధనకి తప్పితే సాంఘికదృష్టి భూతదయ మృగ్యం. కులవ్యవస్థపేరుతో శాశ్వతమైన వర్గసమాజాన్ని ఫాసిస్టు స్థాయిలో సమర్థిస్తుంది మన సాంప్రదాయం. హిందూసాంప్రదాయంలో మానవత్వం ఉందనే గాంధీవాదం మన ప్రజల్ని యింకా మభ్యపెడుతోంది. మానవతావాదం, సామ్యవాదం పాశ్చాత్యదేశాల్లోనే జనించడానికి కారణం ఎన్నిలోపాలున్నా క్రైస్తవమతంలో సిద్ధాంతరీత్యానైనా గోచరించే మానవత్వం. జర్మనుకమ్యూనిస్టు రచయిత బెర్టోల్టు బ్రెక్ట్‌ని నిన్ను అత్యంతంగా ప్రభావితం చేసిన గ్రంథం ఏమిటని అడిగితే బైబిల్ అని సమాధానం యిచ్చాడుట. ఏనాడో కాలదోషంపట్టిన మన సాంఘిక వ్యవస్థను సరిదిద్దాలంటే కులవ్యవస్థతోపాటు వర్గసమాజాన్నికూడ యెదుర్కోవలసి వుంటుంది. అందుకు ప్రాచీన సంస్కృతీ సాంప్రదాయాలతోపాటు ఆనాటి సామాజిక వ్యవస్థను సాధికారంగా విమర్శించే గ్రంథాలు తాపీవారి అడుగుజాడల్లో యింకా ఎన్నో రావాలి. అట్టి మహత్తరకృషికి శంఖుస్థాపనచేసిన తాపీ ధర్మారావుగారు అభ్యుదయ పరులందరికి మార్గదర్శకులు.

— డాక్టర్ ఎస్. వి. ఎస్. రావు

# సాంకేతిక పదకోశం

పరిభాష అంటే ఏమిటి? ఏవి సాంకేతిక పదాలు?

ఒక్కొక్క జీవితశాఖలో ఒక్కొక్కరకంభాష వాడుకలవుతుంది. కోర్టుభాష వేరు, తద్దినాలు పెట్టేటప్పుడువాడే భాషవేరు. పొలాలుదున్నే సందర్భంలోవాడే భాష వేరు. ఇది నిత్య జీవితంలోవాడే భాషకు కొంచెం భిన్నంగా ఉంటుంది. కొత్త కమ్యూనిస్టు హోటలు ఇడ్లీలలో "పురోగమనం" కనిపిస్తున్నది అంటే, అనవసరంగా పరిభాషవాడుచున్నాడన్నమాట,

పరిభాషవెంట "సాంకేతిక పదాలు" అనేవికూడా ఉంటాయి. సాంకేతిక పదాలు ఎప్పుడు పుట్టాయో చెప్పటం సాధ్యంకాదు. మనిషి మొట్టమొదటిసారిగా రాళ్ళనుచెక్కి పరికరాలను చెయ్యడం మొదలుపెట్టినప్పటినుంచీ సాంకేతిక పదాలు పుట్టాయనుకోవచ్చు. విజ్ఞానంతోపాటు అలాంటి మాటల సంఖ్య పెరిగింది. మన పురాణాలలో అనేక అస్త్రాలూ, శస్త్రాలూ, యుద్ధ ప్రక్రియలూ, వాటికి సంబంధించిన పరిభాషా, సాంకేతిక పదాలూ కనిపిస్తాయి. అర్జునుడు బాణాలు వేస్తాడు, అస్త్రాలు ప్రయోగిస్తాడు. మనం అనాగరిక దశఅనుకునే దానిలోకూడా సాంకేతిక పదాలు పుష్కలంగా ఉండేవి.

అయితే నాగరికత పెరుగక పూర్వం సాంకేతిక పదాలు సర్వసామాన్యంగా అందరికీ తెలిసిఉండేవి. పల్లెటూళ్ళలో రైతులూ, వడ్రంగులూ, కమ్మరులూ, కుమ్మరులూ సాలీలు, వర్తకులూ, చెప్పులుకుట్టేవాళ్లూవాడే సాంకేతిక పదాలు అందరికీ తెలిసేఉండేవి. దానికి కారణం, ఆ పదజాలం ప్రజలలో పుట్టినది, ప్రజలలో అతిత్వరగా వ్యాపించినది, ప్రత్యక్షానుభవంతో కూడుకున్నది.

ఈనాడు సాంకేతిక పదాలను కృత్రిమంగా కల్పించవలసి రావటానికీ, వాటిని పుస్తకాలలోకి ఎక్కించటానికీ ప్రధాన కారణం శాస్త్రజ్ఞానం అపారంగా పెరిగిపోవటమూ, ప్రజలకు శాస్త్ర ప్రక్రియలతో ప్రత్యక్షానుభవం లేకపోవటమూనూ, దీనితో బాటు మన దేశంలో వర్గజీవితం కరుడు కట్టుకుపోయింది; పాతకాలపు వడ్రంగులూ కమ్మరులూ వాడే మాటలుకూడా కొత్తకాలపు విద్యావంతులకూ, పట్టణ వాసులకూ ఈనాడు తెలీవు; ప్రపంచం చిన్నదవుతూంటే వర్గజీవితం మరింత కుంచించుకుపోతున్నది.

దీనిఫలితంగా జరిగినదేమంటే, గోడలో మేకుకొట్టటానికి "మెకానిక్" రావాలి. సిమెంటులో బొక్క కొట్టటానికి వాడు ఉపయోగించేదానికి "జంపర్" (జామర్?) అనేది ఒకటి ఉంటుంది. ఇస్త్రీ పెట్టె పనిచెయ్యకపోతే "కనెక్షన్" పెట్టటానికి ఎలెక్ట్రీషియన్ రావాలి. రకరకాలవాళ్ళు, సాంకేతికజ్ఞులూ వాడేమాటలు అందరికీ అందుబాటులో ఉండటానికి సాంకేతికపదావళి పుస్తకరూపంలో రావలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

అలాగే పదావళి సృష్టించవలసిన అవసరం కూడా ఉన్నది. వీటిని ఎవరు సృష్టించాలి? ఏపద్ధతిలో సృష్టించాలి?

సాంకేతికపదాలు అనేవాటిలో రెండురకాలున్నాయి. ఒకరకం మాటలు అంతర్జాతీయస్థాయిగలవి. ఇవి "శుద్ధశాస్త్రం" లో పుష్కలంగా ఉంటాయి, "ప్రయోగశాస్త్రం" (టెక్నాలజీ)లో అంతర్జాతీయపదజాలం చాలా తక్కువ. ఈమాటలను ఎవరి భాషలో వారు సృష్టించుకోవాలి. కాని ఆ సృష్టించేవారు ఎవరు?

సాధారణంగా ఈపని ''పండితులు" చేస్తున్నారు. రైలు ఇంజన్ను ''ధూమశకటం" అనవచ్చు. మోటారుకారును ''స్వయంచోదిత శకటం" అనవచ్చు, ఎలెక్ట్రిసిటీని ''విద్యుత్తు" అనవచ్చు. కాని పండితులు సృష్టించే ఈమాటలను ప్రజలు ఆమోదించరు, ఇంగ్లీషుమాటలనే ఉపయోగించి, "రైలు", ''కారు'', "కరెంటు"అంటారు. వాటికిప్రచారం వస్తుంది, ఆమాటలే నిలబడతాయి. ఎవరిచేతనైనా పోలీసును ''రక్షకభటుడు" అనిపించగలమా? అసాధ్యం.

యిక పరిశ్రమలో పనిచేసే నిరక్షరులు ఫాక్టరీలో ఉండే ప్రతివస్తువుకూ, ప్రక్రియకూ మాటలు సృష్టించటం నాకు తెలుసును. ఆమాటలు— ఇంగ్లీషుపదాల అపభ్రంశరూపాలే ఐనా— వాడుకలోకి తీసుకరావటం సర్వోత్తమం. మనం రైలుఅనే మాటను (rail- పట్టా) అనే మాటనుంచి train అనేమాటకు బదులుగా వాడుతున్నాం: అసలు rails అనేవాటిని ''పట్టాలు'', ''రైలు పట్టాలు", అంటున్నాం. అందువల్ల నష్టమేమీజరగలేదు, అది అలా ఉంచుదాం.

ప్రజలలోనుంచి సాంకేతికపదాలు వచ్చేదాకా మనదేశం వేచిఉండే అవకాశం లేదు. మనం వ్యవసాయప్రధానులంగా ఉన్నాం. మనకు పరిశ్రమలు అంతంతమాత్రం. విజ్ఞానంలో మనదేశం 150 ఏళ్లకాలోలు వెనక ఉన్నదంటున్నారు. ఆ నూటయాభైని నూరుకు తగ్గించాలన్నాకూడా చెయ్యవలసిన పనులలో సాంకేతికపదాల సృష్టి ఒకటి.

సాంకేతికపదాలను సృష్టించేపని ఒక్క కమిటీకే వేస్తేబాగా ఉండేది. అలా జరగలేదు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడకముందు మద్రాసు రాష్ట్రప్రభుత్వం వివిధశాస్త్ర శాఖలకు

చెందిన పారిభాషిక, సాంకేతికపదాలు 1947లో అచ్చువేసింది. దరిమిలా తెలుగుభాషా సమితి తమవిజ్ఞాన సర్వస్వం రెండో సంపుటంలో ఫిజిక్సు, కెమిస్ట్రీలకు సంబంధించిన మాటలకు తెలుగుమాటలు సృష్టించారు. ఈ రెంటిమధ్యా తేడాలున్నాయి. తరవాత తెలుగు ఎకాడమీవారు ఇంటర్మీడియేట్‌కు రచించిన పాఠ్యపుస్తకాలలో ఇంగ్లీషుకు సరిఅయిన మాటలు కొన్నివాడారు. ఇప్పుడు విశాలాంధ్రవారు గణిత, భౌతిక, రసాయన, వృక్ష, జంతు, శరీరశాస్త్రాలకు సంబంధించిన సాంకేతిక పదాలను ఒకే పుస్తకంగా ప్రచురించారు.

పాఠ్యపుస్తకాలలో కొన్నిసాంకేతిక పదాలను ఉపయోగించి, వాటిని రెండు మూడుతరాల విద్యార్థులచేత చదివించి, విద్యావంతులు వాడుకునేటట్టు చేయవచ్చు. అర్థశతాబ్దం క్రితమే మంత్రిప్రగడ సాంబశివరావుగారు నైట్రొజన్ అనేమాటకు నత్రజని అనేమాటవాడితే నేను నాలుగోఫారంలో చదువుకున్నాను. కాని ఈ పదాలను జనసామాన్యం ఆమోదించేటట్టు చెయ్యటం ఎలా ? సాంకేతిక జ్ఞానం కలవారికీ సామాన్యప్రజలకూ మధ్య ఈపదజాలం అడ్డుగోడగా ఉండిపోదా ? సాహిత్యభాషలో గిడుగు రామ్మూర్తి పంతులుగారు "కృతక" భాష అని నిర్వచించినది సాంకేతిక భాషలోకూడా ఉత్పన్నమవుతున్నదని నా అనుమానం.

ఇది ఇలా ఉండగా, సామాన్య ప్రజలకోసం శాస్త్రవిజ్ఞానాన్ని పుస్తకరూపంలో వెలువరిస్తున్నవారు చాలామంది ఉన్నారు వీరిలో కొందరైనా సాంకేతికపదాలను స్వతంత్రంగా సృష్టిస్తున్నారు.

ఈ తేడాలన్నీ పరిశీలించి ఏపదాలు "మంచివి" ఏవి "చెడ్డవి" అనేది ఏదో ఒక స్థాయిలో నిర్ణయించటానికైనా అనేకమంది "ప్రవీణులు" కొన్ని ఏళ్ళపాటు శ్రమిస్తేనేగాని సాంకేతికపదావళి ఒకదారికిరాదు.

ఈ సమీక్షకోసం నేను వ్యయపరచగల కొద్దికాలంలో కొన్ని వ్యత్యాసాలు మాత్రమే స్థాలీపులాకంగా చూపగలను. నాదృష్టిలో ఏమాటలుబాగున్నాయో, ఏవిబాగా లేవో చెప్పగలను. కాని నా అభిప్రాయం ఎలా ప్రమాణమవుతుంది.

ఉదాహరణకు తెలుగు ఎకాడమీవారు ఆమోదించిన మాటలనూ కొండేపూడివారు సేకరించిన మాటలనూ ఇస్తున్నాను.

Speed అనే మాటకు "వేగమూ, త్వర" అని కొండేపూడివారు అన్నారు. Velocity అన్నమాటకూ వారు అమాటలేవాడారు. ఇది స్పష్టంగా తప్పు. తెలుగు ఎకాడమీవారు speed కు వడిఅనీ, Velocity కి వేగం అనీవాడారు. కనీసం రెంటికీ తేడాచూపారు.

Acceleration అనేమాటకు కొండేపూడివారు "వేగోత్కర్షణ, వేగాధిక్యత, గతివృద్ధి" అనేమాటలు ఇస్తే, తెలుగు ఎకాడమీవారు "త్వరణం" అనేమాట ఇచ్చారు. "వేగ వృద్ధి" అనే అందరికీ అర్థమయేమాట ఇద్దరూ ఇవ్వలేదు.

"Boiling point" అనేదానికి కొండేపూడివారు "క్వథనబంధువు" అనేమాట ఇచ్చారు. తెలుగు ఎకాడమీవారు "మరుగు ఉష్ణోగ్రత" అని కుండబగలేసి అన్నారు.

Atom Bomb ను మొదటివారు "అటంబాంబు" అనీ రెండోవారు "పరమాణు బాంబు" అనీ అన్నారు. "అటంబాంబు; అణుబాంబు" అనీ వాడుకలోకివచ్చేసింది. "Atom" పరమాణువుకాదని ఏనాడో తేలిపోయింది.

Boyl's Law అనేదాన్ని కొండేపూడివారు "బోయిల్‌సూత్రం" అన్నదే సబబుగా తోస్తుంది. తెలుగు ఎకాడమీవారు "బాయిల్ నియమము" అనటం సబబుగా కనబడదు. బాయిల్ సూత్రీకరించాడుగాని, నియమించలేదు.

Chemical reaction అన్నమాటకు కొండేపూడివారు "రసాయనికప్రతిచర్య" అనటం "ముక్కుశ్చముక్కః"గా ఉన్నది. తెలుగు ఎకాడమీవారి "రసాయనచర్య" అన్నది సరిగా ఉన్నట్టుతోస్తుంది.

ఇలా వివరిస్తూపోతే ఎన్నిరోజులపాటైనా వివరించవచ్చు, కాని ఆవివరణకూడా ప్రమాణం అనిపించుకోదు.

ఒక్కముక్కలో చెప్పాలంటే ఇన్నిరకాల సాంకేతికపదాలూ తాత్కాలికమైనవే అనుకోవాలి. తుదినిర్ణయం కాలానికీ, ప్రజలకూ వదలవలిసిందే.

ప్రస్తుతానికి పాఠ్యపుస్తకాలలో ఉండే పదజాలం, మంచో, చెడో, నెగ్గేస్తుంది. కాని ఆ పదజాలం చిరంజీవిగా నిలవదు. కొండేపూడివారు సేకరించిన పదజాలం చాలా విస్తృతమైనది. ఎంతోకష్టసాధ్యమైనది, జనసామాన్యం కోసం విజ్ఞానగ్రంథాలు రాసేవారు తమకు మాటతోచని పరిస్థితిలో ఈ సాంకేతికపదకోశాన్ని ఉపయోగించుకోవచ్చు.

— కొ. కు.

---

# ఏకపద్యోపాఖ్యానము

వెఱ్ఱి వేయి రకాలుగా ఉంటుందంటారు పెద్దలు. అంటే ఒక్కొక్కరిలో ఒక్కొక్క రకం వెఱ్ఱి ఉంటుందన్నమాట. కాని ఈ వేయి రకాల వెఱ్ఱిని మనం ఒక్క శ్రీ బోయి భీమన్నలో చూడవచ్చు. దానికి ఆయనగారి ఇటీవలి రచనలే నిదర్శనం.

ఈ 'ఏక పద్యోపాఖ్యానము'లో శ్రీ భీమన్న ద్విపాత్రాభినయం కనిపిస్తుంది. ఒకటి 'మహాకవి'గా మరొకటి 'మహాసుధి'గా. మహాకవిగా ఒకే ఒక్క అర్థంలేని మహా పద్యాన్ని రచించగా, మహాసుధిగా ఆ ఏక పద్యానికి తలా తోకలేని 85 పేజీల మహా మహా వ్యాఖ్యానం చేయడం జరిగింది. 8 పేజీల అవతారికలో ఈ గ్రంథం పుట్టుటకు గల కారణాల్ని వివరించడం జరిగింది. ఆ కథ ఇది— శ్రీ భీమన్న పూర్వం 'ఆంధ్రపత్రిక' సంపాదకవర్గంలో పనిచేస్తూండగా ఏదో ఒక గ్రంథానికి సమీక్ష వ్రాయవలసి వచ్చింది. ఆ సమీక్ష గ్రంథకర్తకు కోపకారణమైంది. దానిపై సదరు గ్రంథకర్త తిడుతూ రోజుకో ఉత్తరం 'ఆంధ్రపత్రిక' సంపాదకులకు వ్రాయడం జరిగింది. ఈ సంఘటన శ్రీ నార్లకు చిరాకు కలిగించింది. కాని శ్రీ భీమన్న మాత్రం "ఏ చెత్త కావ్యాన్నైనా మహా కావ్యంగా నిరూపించవచ్చు- అది పాండిత్యం లోని ప్రక్రియే కాని కవితలోని ప్రతిభ కాదు, మనం ఏ విధమైన క్షమాపణా ప్రక టించ నక్కరలేదు" అని బదులు చెప్పి, తన సీటు మీదికి వెళ్లి అప్పటికప్పుడే ఏక పద్యోపాఖ్యానము పేరుతో తాను ప్రతిజ్ఞ చేసినట్లుగానే చెత్త కావ్యాన్ని రచించాడు. ఇది ఇరువది సంవత్సరాల క్రిందటి మాట. ఇంత కాలం దాకా ఇది అరణ్యవాసం అనుభవిస్తున్నా కొందరు వందిమాగధుల ప్రోద్బలం వల్ల ఇటీవలే అచ్చై వెలుగు లోకి వచ్చింది. ఇంతకూ ఆ ఒకే ఒక్క మహా పద్యం ఇది—

> అదిగో, ముందొక గర్లు, వెప్క మన, మాహా! బ్యూటిఫుల్ బ్యూటిఫుల్,
> ఎద హూ రెత్తెమ క్లౌడ్సులోకిచను బల్ హెచ్ బాంబన్నట్లుగా
> ద దదా, చిత్తమ, కంగుపట్టుకొను వొంతన్ బోదువో! చేతిలో
> మెదడుందా! బహుతప్ప, పిల్చెనవె సామీప్యంపు సారూప్యముల్.

అధిక్షేప కావ్యాల పరమ ప్రయోజనం ఏమిటంటే— ఎదుటి వాని బలహీనతల్ని హాస్యరసగర్భితంగా ఎత్తిచూపడం. ఆత్మ విమర్శ చేసుకోవడానికి అవకాశం కలిపిం చడం. తన పరివర్తనకు తానే సగ్గుపడేటట్లుచేసి చిత్త వికాసాన్ని కలిగించడం. ఇది

రెండు రకాలు. ఒకటి శబ్దచమత్కృతివల్లనో లేక అర్థవైచిత్రివల్లనో సాధింపబడేది. దీనిద్వారా ఉత్తమ హాస్యం ఆవిష్కరింపబడుతుంది. మరొకటి వికార వేషభాషణాదుల వల్లనో లేక వెక్కిరింపువల్లనో సాధింపబడేది. అంటే చవకబారు హాస్యమన్నమాట. దీన్ని హాస్యం అనడంకన్నా అపహాస్యం అంటే చక్కగా కుదురుతుంది. సర్కస్‌లో బఫూన్ పాత్ర ద్వారా ఈ రకమైన అపహాస్యమే కలుగుతుంది. ఈ రెండవ రకమైన అపహాస్యమే ఈ గ్రంథంలో కనబడుతుంది.

అర్థం పర్థం లేకుండా విషయాన్ని అప్రస్తుతాంశంలోకి సాగదీసి వక్తవ్య విషయాన్ని స్ఫురింపజేయ లేకపోవడం, కళాత్మక దృష్టి లేకపోవడం, ఆత్మ సంయమనం లోపించడం వల్ల దీన్ని చదువుతుంటే పాఠకుడికి విసుగు కలుగుతుంది. కొన్ని చోట్ల విషయం రాజకీయ నాయకుల ఉపన్యాస ధోరణిలో కప్పగంతులు వేస్తూ, వ్యంగ్య మర్యాద కూడ విసర్జించి, కవి వ్యక్తిత్వం తొంగిచూస్తుంది. (ఉ॥ పేజి నం. 65, 66, 67 వంటివి). నిజానికి ఈ రకమైన గ్రంథాలు చదువుతుంటే పాఠకుడికి ఆసక్తి పెరగాలి. చివరిదాకా విడువకుండా చదివించే ఆకర్షణ ఉండాలి. దానికి చాలా ప్రతిభ అవసరం. ఈ ప్రధానమైన గుణాలే ఇందులో లోపించాయి. కనక ప్రియత్నం విఫలమైంది.

కాని ఇలాంటి ప్రియత్నం మాత్రం హర్షింపదగిందే. ఈ పద్ధతిలో ఇంకా ఉత్తమ కావ్యాలు రావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఇది నూతన ప్రయోగం అనడంలో సందేహం లేదు. సరిగ్గా ఈ పద్ధతిలో కాకున్నా అయిదారు సంవత్సరాల క్రితం డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు "కుమతీ శతకం" అన్న పేరుతో ఒక అధిక్షేప శతకం ప్రకటించాడు. దానికి 'ఇతిశ్రీ' 'మతిశ్రీ' అన్న కల్పిత నామాలతో ఒకరిని గ్రంథకర్తగా, మరొకరిని పీఠికాకర్తగా పరిచయం చేయడం జరిగింది. అది కూడా ద్విపాత్రాభినయమే- అక్కడ ఉత్తమ హాస్యం ఆవిష్కరింపబడింది.

పీటిని ఎదుటి వానిపై కసితో కాకుండా, ఆత్మ సంయమనంతో నిర్వహిస్తేగాని పాఠకుల్ని రంజింప జేయలేం. అందుకో రచయితకు కొంతైనా చిత్తశుద్ధి అవసరం. "నిష్పక్షపాతమైన నిర్దుష్టమైన సాహిత్య విమర్శ" కోరదగిందే. "అయినవాడికి అమృతం, కానివాడికి కషాయం" వడ్డించే విమర్శక శిఖామణులకు ఇలాంటి రచనలు కశాఘాతంలా ఉంటాయనటంలో సందేహంలేదు. మరి ఇంత నిష్పక్షపాత బుద్ధే కనుక ఉంటే, ఇదే రచయిత ఒక పుస్తకం పీఠికలో ఇలా వ్రాయడం జరుగుతుందా?

"ఇక—

తెలుగు సరస్వతికి ఎవరు దిక్కు?

ఒక నారాయణరెడ్డి
ఒక దాశరథి
ఒక ఆరిపిరాల
ఒక భీమన్న
ఒక బాపురెడ్డి
ఒక ........"

ఇలా ఇంకా వింత ధోరణిలో ఆ పీఠిక సాగుతుంది. మరి ఈ రకమైన ద్విపాత్రాభినయానికి కారణం ఏమై ఉంటుంది? ఏదో ఉబుసుపోకకైనా వ్రాసుకున్న కబుర్లను ఒక చోట కలిపి అచ్చువేయడం సాహసమే అనాలి.

- 'పేర్వారం'

---

ఏకపద్యోపాఖ్యానము
సవ్యాఖ్యానము
(సాహితీ వ్యంగ్య రచన)
రచయిత: శ్రీ బోయి భీమన్న
ప్రచురణ: సన్మాన సంఘం, భాగ్యనగరం
పేజీలు: 8 + 92 = 100
వెల: రెండు రూపాయలు
ప్రతులకు: సుశీలా నికేతన్, ఐ.సి. 85, ఇర్రంమంజిల్ కాలనీ,
హైదరాబాదు-4.

---

## 'వెలుగు'

అభ్యుదయ విద్యార్థుల సంఘం. అర్సపల్లి, నిజామాబాద్ జిల్లా సైక్లోస్టయిలు ముద్రణతో వెలువరిస్తున్న సాహిత్య త్రైమాసిక 'వెలుగు' అక్కడి యువ రచయితల్లోని చైతన్యానికి దర్పణం. పడకటింటి రచనలు కావాలని ప్రచారం చేసే పత్రికల మధ్య విప్లవ రచనలకు ప్రచార సాధనాలు కొరవడ్డాయి. అయినా సాహిత్యాంధకారంలో 'వెలుగు'ను సృష్టించుకొని, సైక్లోస్టయిలు పత్రిక అయినా, ముద్రిత పత్రికలతో దీటుగా వెలువరిస్తున్న యువ విద్యార్థుల కృషి శ్లాఘనీయమైంది. అక్షరాలు

ముత్యాల్లా ఉండటమేకాక, 'విజయ' చిత్రించిన ముఖపత్ర చిత్రాలు, లోపలి టైటిల్స్, రేఖా చిత్రాలు, బైండింగు, గెటప్ ముద్రిత పత్రికల స్థాయిలో ఉన్నాయి. చిత్రాల్లో కనిపించే విప్లవ ఇతి వృత్తాలు గమనించదగినవి. ఇది రూపురేఖల విషయం.

ఆధునిక సాహిత్య సమస్యలకు, సంఘటనలకు ఈ పత్రిక ఎలా స్పందిస్తుందో ఈ సంచికల్లోని సంపాదకీయాలు చూస్తే తెలుస్తుంది.

"గోర్కీని, రెడెస్ జిబ్రేను నిర్బంధిస్తేనూ వారి రచనలను నిషేధిస్తేనూ విప్లవం ఆగలేదు, కనీసం వారి రచనల ప్రచారం తగ్గలేదు. ఒక మేధావి చెప్పినట్లు "విప్లవ భావాలను నిషేధించవచ్చును, కాని నిర్మూలించలేరు." అలాగే విప్లవ రచయితలను నిర్బంధించడం ద్వారా వారి భావాల ప్రచారాన్ని అడ్డుకోవడం సాధ్యంకాదు."

(సెప్టెంబరు, అక్టోబరు 71)

"వరంగల్ మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గారు, కాలేజీ మాగజైన్ సంపాదక వర్గమూ, శ్రీ శ్రీ వ్యాసాన్ని తమకుతామై అడిగి తీసుకొని, ప్రచురించి, తర్వాత చించివేయడం ద్వారా శ్రీ శ్రీ ని అవమానించాలని ప్రయత్నించారు, కాని తమను తామే అవమానించుకున్నారు. అరచేత్తో సూర్యకాంతినాపాలని ప్రయత్నించటం మూర్ఖత్వం. శ్రీ శ్రీ వ్యక్తిత్వం తెలుగునాడులో ఎవరూ అవమానించలేనంతగా పెరిగి పోయింది....

"నిన్నటిదాకా శ్రీ శ్రీ ని పొగడుతూ బ్రతికినవాళ్లు యివాళ శ్రీ శ్రీ ని తిడుతున్నారు. ఈ ప్రభుత్వం క్రింద తామనుభవిస్తున్న ప్రత్యేక సౌకర్యాల వునికికి భంగం వాటిల్లుతుందన్న స్వార్థమే దీని ద్వారా వ్యక్తమవుతున్నది. ఏది ఏమైనా, ఆకాశం మీద ఉమ్మితే అది తమ మొహాన్నే పడుతుందని వారు గుర్తించడం మంచిది."

(జులై, ఆగష్టు 71)

శ్రామిక వర్గాన్ని చేరగల సాహిత్యం సృష్టించే తపన ఈ యువ రచయితల్లో ఉంది. ఇందులోని పాటలు, 'గతుకుల బ్రతుకులు' (టి. కృష్ణమూర్తి), 'కాస్కో-దెబ్బ' (కె. ఎన్. రావు), 'కూలిపోరు' (కె. ఎన్. రావు), 'ఉన్నంత మాటంటె మిన్నంతకోపం' (శృంగారం) శ్రామికవర్గం పాటలుగా పాడుకోతగ్గవి. ఇటువంటి సాహిత్య సృష్టి జరగవలసిన అవసరాన్ని విప్లవ రచయితలు గుర్తించిన తరుణంలో వీరు ముందుకువచ్చి రచనలు చేయటం అభినందించదగిన విషయం.

'చెదరని గుండెలు' (అరుణ), 'కేన్సర్' (పరమేశ్వరరావు), 'ఆపరేషన్' (కైలాస్), 'మతిమంతులు' (శ్రీహరి), 'రాబందులరాజ్యం' (యశ్వంత్), 'నేను కవిని-రచయితని' (అరుణబాబు), 'కాంతి కిరణాలు' (పి. సురేశ్) కవితల్లో ఈ వ్యవ

స్థను మార్చవలసిన అవసరం గురించి, మేధావివర్గాల తప్పుడు నడతల గురించి, సమాజంలోని దురన్యాయాల గురించి రాసారు.

తూర్పు తెలియని పట్నంలో
సూర్యోదయం ఎలా చూడను ?
అద్దెకోసం కట్టించిన బంగళా
అడ్డమైంది సూర్యోదయానికి....
ఇపుడు తెల్సుకున్నాను
ఉదయభానుని ఉదయ కిరణం చూడాలంటె
ముందు పల్లెకెళ్ళాలని

(చెదరని గుండెలు – అరుణ)

ఆలోచిస్తున్నావేమిటి బ్రదర్ (డాక్టర్)
ఇది యమర్జన్సీ కేసు
ఏ మాత్రం ఆలస్యం చేసినా
ఘోర ప్రమాదం సంభవిస్తుంది
ఇప్పటికె ఇరవైమూడు సంవత్సరాలైంది
ఈ వ్యాధి మొదలై....
అందుకె అంటున్నాను నేను
కత్తికి పదును పెట్టమని
ఆపరేషన్‌కి ఆయత్తమవమని

(కేన్సర్– పరమేశ్వరరావు)

ఒక్కొక్క వేడికిరణం ఒక్కొక్క వాడిబాణం
ఒక్కొక్క బాణం ఒక్కొక్క దానవుని ప్రాణంతీస్తుంది....
ఆ బాణాలు తీస్తాయి కొన్నివేల దానవుల ప్రాణాలు
పోయిన ఒక్కొక్క ప్రాణం
ఈ ఫ్యూడల్ వ్యవస్థా భవనానికి
రాలి పోయిన ఒక ఇటుకరాయి

(ఆపరేషన్– కైలాస్)

ఇందులోని కవితల్లో విప్లవ సాహిత్యపు వాడీ వేడీ ఉన్నాయి కాని, శిల్పరీత్యా ఇంకా పరిపూర్ణతను సమకూర్చుకోవలసిన అవసరం ఉంది. వచన కవిత ముసుగులో కొంత తప్పుడు వచనం కూడా ఈ సంచికల్లో చోటు చేసుకుంది. మచ్చుకు ఇది చూడవచ్చు.

మూడు మూరల లోతుకు పీక్కుపోయిన
కళ్లుగల శ్రామికుల్లారా!
వెన్నెముక నంటిన కడుపుగల
శాంతికి ప్రతిరూపంలా నిల్చిన ఓ రైతులారా!
ఆఫీసుల మెట్లు ఎక్కుతు దిగుతు
నిస్సహాయ స్థితిలోనున్న పాదరక్షలుగల నిరుద్యోగుల్లారా
(ఆశాజ్యోతి — యం. రాములు)

కొన్ని రచనల్లో సామాజిక పరిస్థితుల పట్ల సరయిన అవగాహన లోపించటం కనిపిస్తుంది.

న్యాయం ధర్మం చచ్చిపాయె
అన్యాయం అధర్మం పెరిగిపాయె
(వ్యత్యాసం — జి. శ్రీహరి)

ఈ రచయిత దేన్ని న్యాయంగా, దేన్ని ధర్మంగా భావిస్తున్నట్లు? Cliches వాడకుండటం మంచిది.

'వ్యభిచారంలో వ్యత్యాసం'లో రచయిత (వి. చంద్రశేఖర్) చెప్పదలచుకున్న దేమిటో అతనికే తెలియదు.

జులై, ఆగస్టు 71 సంచికలో ఆరెట్టి నారాయణ రాసిన 'దేవుడు' కథలో పల్లెటూళ్లలోని భూస్వామ్య వ్యవస్థ క్రింద శ్రమజీవులు పడుతున్న హింస వాస్తవికంగా చిత్రించబడింది. తెలంగాణా పల్లెపట్టు శ్రమజీవుల నుడికారం విరివిగా వాడిన ఈ కథలో, రచయితకు వాళ్ల మనస్తత్వం పట్ల సదవగాహన మరికొంత అవసరమనిపిస్తుంది. సమ్మె ప్రారంభించిన దేవుడు అనంతరావుచేత దెబ్బలు తిన్నప్పుడు నమ్రంగా మెదలకుండా మర్యాదగా మాట్లాడటం అసహజంగా వుంది. ఇందులో రైతు కూలీలు నెలకు యాభై రూపాయల జీతాన్ని పొందుతూ డెబ్బై రూపాయలదాకా పెంచాలని సమ్మె చేస్తారు. కాని తెలంగాణాలోని చాలా ప్రాంతాల్లో రైతుకూలీలు నెలకు యాభై రూపాయలు కూడా పొందటం లేదు.

ఈ రెండు సంచికల్లో ఉన్న పుస్తక సమీక్షలు ప్రస్తుత సమస్యల యెడల ఒక నిర్దుష్టదృక్పథంతో చేయబడినవి. కేవలం ఉబుసుపోక వ్రాతలు, మొహమాటపు మెచ్చుకోలు కాకుండా సూటిగా చేసిన ఈ విమర్శలు పాఠకులకు ఎజుకెటివ్‌గా ఉండగలవనటంలో సందేహంలేదు.

విప్లవ సాహిత్య సాధన ఒక అవిరళ కృషి. నిరంతరం అప్రమత్తతతో సాగించవలసిన ప్రస్థానం. తమ యువోత్సాహాన్ని నిర్మాణాత్మక దిశగా మరల్చి భావ ప్రచారానికి కృషిచేస్తున్న అభ్యుదయ సంఘ సభ్యులు అభినందనీయులు. సైక్లోస్టయిలు పత్రికను నిర్వహించటంలో గల సాధక బాధకాలు ఒకప్పుడు దాని నిర్వహణకు ఆటంకాలుగా పరిణమించటం జరుగుతుంది. సైక్లోస్టయిలు పత్రికా నిర్వహణకు, ముద్రిత పత్రికకు ఖర్చులో పెద్ద తేడా ఉండదు. చిత్రాలు లేకుండా, ఈ రచనల్నే కొద్ది మాత్రపు అధిక వ్యయంతో ముద్రించవచ్చు. ఎంత అందంగా వెలువరించినప్పటికీ సైక్లో స్టయిలు పత్రికను చదవటానికి కొంత ప్రయత్నం అవసరం. ఈ ప్రయత్నానికి కొత్త వాళ్లందరు పూనుకోరు కాబట్టి భావ ప్రచారం పరిమిత వ్యక్తుల్లోనే మిగిలిపోతుంది. తమ ఉత్సాహం ధరించిన ఈ రూపం ముద్రిత పత్రికగా మార్పుచెంది స్థిరత్వాన్ని పొందగలదని ఆశించవచ్చు.

— రామన్న

## నేటి చిత్రకళ- కళా రంగము.

నవంబర్ 'సృజన'లో ''లలితకళా అకాడమీ చిత్రకళా ప్రదర్శన-ఒక సమీక్ష'' అనే వ్యాసం వచ్చింది. సృజన పాఠకులు చాలామంది నేటి చిత్రకళతో చెప్పుకోదగిన పరిచయంలేనివారే. అందు వలన ఈ సమీక్షలోని సమీక్షకుల అంచనాలలోని వైరుధ్యాలూ-భావాలలోని అయోమయతా పాఠకులపై ప్రభావం వేయగల ప్రమాద మున్నదని భావించి కొన్ని యదార్థాలను స్పష్టం చేయదలచాను.

మన సమీక్షకులు వ్రాసిన పద్ధతినిబట్టి వారికి నేటి చిత్రకళను గురించిగానీ, కళాపరిణామాల్ని గురించి, విలువలను గురించిగానీ, సరియైన, స్పష్టమైన అవగాహన లేదని తెలుస్తున్నది. మన కళారంగంలోని నేటి చిత్రకారుల్లో అధిక సంఖ్యాకులు అయోమయావస్థలోనున్నమాట నిజమే. కానీ, మన సమీక్షకులు అంతకన్నా ఎక్కువ అయోమయంలో ఉన్నారు.

ఈనాటి చిత్రకళలో, సాంఘిక దృక్పథం, సామాజిక ప్రయోజనం గురించి చర్చించుకునే మనబోంట్లం ఆదరించదగిన, ఆలోచించదగిన విలువలేవీ లేవు. నేటి చిత్రకారుల్లో నూటికి ఏ ఒకరిద్దరోతప్ప అందరూ ''నా ఆత్మానందంకోసం....'', ''కళను ఉన్నతస్థానంలో నిలబెట్టాలి....'' లాంటి తాతలనాటి చచ్చు కబుర్లు చెపుతూ, తమ తమ మానసిక చీకటిగుహల్లో విహరిస్తూ ప్రపంచవ్యాపితంగా ప్రసిద్ధిలోనున్న యూరోపియన్ కళా విలువలనూ, భావజాలాన్నీ కూడా అనుసరిస్తూ, ఏడాదికోసారి తద్దినాల్లా జరిగే అకాడమీల వార్షిక చిత్రకళా ప్రదర్శనల్లో స్థానం కోసం, ప్రైజుల కోసం తినాల్సిన గడ్డి ఏదో తింటూ, ప్రైజువస్తే కాలర్ ఎగరేసుకుంటూ, రాకుంటే ''ఈ దగుల్బాజీ అకాడమీల పక్షపాతధోరణు''లను గురించి ప్రైవేటుగా తిట్టుకుంటూ, కొనేవాడులేక తమ పెయింటింగుల్ని అటకలమీద భద్రపరచుకుని, తమ కళనుకొని ఆదరించని ''దిస్ అన్ కల్చర్డ్ ఇండియన్ పీపుల్''ను తిట్టుకుంటూ కాలక్షేపంచేస్తున్న వారే.

కనుకనే గత ఫిబ్రవరిలో న్యూఢిల్లీలో జరిగిన- మన అకాడమీ వారేర్పాటు చేసిన- అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శనను దర్శించినప్పుడు దానిని గురించి వ్యాసం వ్రాయమని ఓ వారపత్రికవారు అడిగినా, ఆ నాన్సెన్సుగురించి మరికొంత నాన్సెన్స్ సృష్టించటం ఇష్టంలేకా, పత్రికలవారికి కావలసిన విధంగా భజనచేయటం చేతగాకా అందుకు నిరాకరించాను.

సాహిత్యరంగంలో కనిపించే మార్పువంటిది చిత్రకళారంగంలో ఇంకా రావలసే ఉన్నది. మనం చేయవలసింది అటువంటి మార్పుకు దారితీసే ఆలోచనలకూ, ఆచరణకూ దోహదనివ్వటమేగానీ మన సమీక్షకుడు చేసినట్లు తెలిసీతెలియని పొగడ్తలతో అవతలివాళ్ల 'మనదారే సరైన'దనుకుని సంతృప్తిపడి ఆగిపోయేలా ఆకాశానికెత్తటంకాదు.

అకాడమీ ప్రదర్శనలోని 44 పెయింటింగ్స్‌లోనూ 18కి పేర్లులేవనీ, అదేమిటని ప్రశ్నిస్తే "అసలు పేరంటూ ఎందుకుండాలి అని తిరగబడతారు" అనీ అదేదో గొప్ప విషయమయినట్లుగా రాశారు మన సమీక్షకులు. మళ్ళీ ఈ తిరుగుబాటు చిత్రకారులే తమ చిత్రాలకు "పెయింటింగ్, జూలై-1" అనీ, "పెయింటింగ్-30" అనీ, "కాన్వాస్-3, 1970"అనీ పెడుతూనే ఉంటారుపేరు. లోగడ ఓ చిత్రకారుడు తెలివిగా తన ఇంటి మునిసిపల్ నెంబర్నే ఓ పెయింటింగ్‌కు పెట్టగా, మన సమీక్షకునిలాంటివారంతా దానిముందుపోగై "ఏమిటీ ఈ నెంబరుకూ - పెయింటింగ్‌కూ అర్థం"అని బుర్రలు చెడగొట్టుకున్నారు. దీనర్థం ఏమంటె ఆసలు ఆయా చిత్రకారులకే తమ పెయింటింగ్స్ ఎందుకు వేస్తున్నదీ, అందులో ఏ భావజాలాన్ని వెల్లడిస్తున్నదీ స్పష్టంగా తెలీదని.

కనుక మనబోంట్లం ఈ గాడిదగుడ్డకు ఈకలు పీకచూడటం వృథా. (నీచోపమానానికి నన్ను తిట్టుకోనక్కర్లేదు, కోడిగుడ్డుకయితే ఈకలు పీకటానికి విసుగెత్తి ఓ దెబ్బవేస్తే కనీసం ఓ ఆమ్లెటన్నా దొరుకుతుంది మరి.) అలాగే వాటిల్లోంచి యేవో విప్లవార్థాలనూ "సామాజిక వైరుధ్యాల పోరాట భీకరత"నూ, "పికాసో గెర్నికా"లో గుర్రం తలకాయలో ఉన్నంత భావసంపద"నూ మన సమీక్షకునిలా వెదికి పట్టుకోజూడటం అమాయకత్వం.

ఇంతులో మన సమీక్షకుడిని అనాల్సిందేమీలేదు. సదరు అకాడమీవారికే తాము ప్రైజులిస్తున్న ఆయా చిత్రాలగురించి సరిగా తెలీదు. ఆమధ్య అవార్డ్ ఇచ్చిన ఓచిత్రం తాలూకు ఫోటోను (చాలా పెద్దసైజులోనే) అందమైన ఆర్టుపేపరు కాట్లాగులో తలక్రిందులుగా అచ్చుగుద్ది— ఆ చిత్రకారిణి వచ్చి ఇదేమిటని ఏడుపుమొహం పెడితేగానీ తప్పు తెలుసుకోలేకపోయారు. మరోసందర్భంలో అసలు పెయింటింగ్‌నే తలకిందులుగా వేలాడదీశారు.

గత సంవత్సరాంతంలో దేశంలోని ప్రముఖ-అప్రముఖ చిత్రకారులు ఓ రెండొందలమంది కేంద్రలలితకళా అకాడమీకి వ్యతిరేకంగా ఉద్యమం లేవదీశారు. అకాడమీ ముసలోళ్ళను కొందర్నే నెత్తికెక్కించుకుంటూ తమను నిర్లక్ష్యం చేస్తోందనేది మూల

కారణం, కొసరు కారణాలు చాలా ఉన్నాయి. అసలు అకాడమీనే రద్దుచేయాలనీ, అదనీ—ఇదనీ గర్జించారు. ఓ రెండు నెలలపాటు చిత్రకళారంగం ఉద్రేకపూరితంగా రూపొందింది. అందు మీదట అకాడమీ వారు ఢిల్లీలో ఓ సదస్సు ఏర్పాటుచేసి ప్రముఖ—అప్రముఖ చిత్రకారుల్ననేకమందిని విమానం లేదా రైలుఖర్చులూ, దినభత్యాలూ యిచ్చి మరీ చర్చలకాహ్వానించారు. ఈ చరిత్రాత్మక "తిరుగుబాటు" సదస్సుకు హాజరయే మహద్భాగ్యం నాకూ కలిగింది. ఏంజరిగిందంటే....?

రెండు రోజులపాటు నురుగులవాళ్ళంతా మైకులు బద్దలయిపోయేలా గర్జించారు. మీసాలు మెలేశారు. బల్లలుకూడా బద్దలవాల్సిందేగానీ ఆ సమావేశం జరిగిన ఏర్ కండిషన్డ్ హాల్లో ఫర్నిచర్ చాలా ఖరీదయినది. రెండవరోజు సాయంత్రం మీక్కూడా అకాడమీలో పదవులిస్తాం అన్నట్లుగా ఓ తీర్మానం పాసుచేసేసరికి మన మీసాలు, గడ్డాల తిరుగుబాటు దార్లంతా జైహింద్, జైభారత్ అనుకుని దినభత్యాలకూ, రైలుఖర్చులకూ క్యూలో కాసేపుగడిపి ఓ మంచి మందుపార్టీ ఆ రాత్రికి ఏర్పాటుచేసుకుని యథా విధిగా తిరిగి కళాసేవ ప్రారంభించారు.

అయ్యా, ఇదీసంగతి. ఇంకో ఖరీదయిన తిరుగుబాటు కథ కావాలంటే వినండి.

ఈ మధ్య తన డాక్యుమెంటరీకి ఓ ఇంటర్నేషనల్ అవార్డు తెచ్చుకున్న ఎం. ఎఫ్. హుస్సేన్ పేరు మీరంతా వినే ఉంటారు. ఆయనగారు బ్రెజిల్‌లో జరిగే ఇంటర్నేషనల్ ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో తనకు చోటుదొరకనందుకు అలిగి "నా స్వంత ఖర్చుతో బ్రెజిల్ వెళ్లి ఆ ఎగ్జిబిషన్ ప్రారంభ దినాన వాళ్ల ఆర్ట్ గ్యాలరీ గుమ్మంలో నా పెయింటింగ్ ఒకటి తగలెట్టి తిరిగివస్తాను" అని ఓ ఘోర ప్రతిజ్ఞచేశాడు. అది విన్న ఆ బ్రెజిల్ అకాడమీవాళ్లు హడలిపోయి కాబోలు ఈయన్ని స్పెషల్ ఇన్వైటీగా ఆహ్వానించారు. దాంతో ఆ తిరుగుబాటు సుఖాంతమయింది. మన కళ ఉద్ధరింపబడింది.

కనుక, తిరుగుబాటు వగైరా పదజలాన్ని వాడేటప్పుడూ, పాఠకులకు పరిచయం లేని విషయాల్నిగురించి అంచనాలు వేసేముందూ కాస్త లోతుగా పరిశీలించటం అవసరం.

అసలు కళ- కళావిలువలు- స్వభావ స్వరూపాలు గురించి ఒక స్పష్టమైన అవగాహన, అంచనాలేకుండా చర్చిస్తే "మనోహన్‌దత్ ఫిగరిటెవ్‌నుంచి అబ్‌స్ట్రాక్ట్‌లోకి రావటం సాంఘిక లక్ష్యాలకు దూరమవడమే"అని రాసిన మన సమీక్షకుడే దానికి రెండు పేరాలపైనే "దేవరాజ్ పూర్తిగా అబ్‌స్ట్రాక్ట్స్ చేస్తున్నాడు... ఆ రంగుల పొందికకు మనం తన్మయుల మవుతాము" ("అవి అర్థంకావు"ట- అయినాసరే) అని వ్రాయటం

లాంటి పొరపాట్లు జరుగుతాయి. సమీక్షకులు తన అయోమయతను పాఠకులకు అందజేయటం అసంబద్ధం.

"సామాజిక చైతన్యం ఉన్న చిత్రకారుడు దేశపరిస్థితులను చూస్తూ ఊరికే కూచోలేడు. తన తీర్పు చెపుతాడు. తన బాధ్యతనించి, తనకున్న సంబంధంనించి తప్పించుకోలేడు. దొరైస్వామి చిత్రాలలో ఈ గురుతరమైన బాధ్యత కన్పిస్తుంది" అని రాశారు మన సమీక్షకులు. ఆ చిత్రం (రేప్ ఆఫ్ బంగ్లాదేశ్) యథాతథంగా 'సృజన' కవరుమీదనే ఉంది గనుక ఆ చిత్రకారుడు తన 'బాధ్యత'ను ఎంత ప్రతిభావంతంగా, కళాత్మకంగా చూపిందీ పాఠకులే నిర్ణయించుకోవాలి. అందులో అర్థంగానిదేమీలేదు. ఓ పాతచింతకాయపచ్చడి లైపు ఉపమానం తప్ప ... మనం పుట్టకముందే కీ.శే. చిలకమర్తి వారు పాడారు "భరతఖండంబు చక్కని పాడియావు, పితుకుచున్నారు మూతులు బిగియగట్టి, తెల్లవారను గడుసరి గొల్లవారు" అని. ఆ ఉపమానాల స్థాయినిమించి ఇన్నేళ్ళతరువాతకూడా మనం ఏమీ ఎదగలేదా? భావుకత సంగతలాఉంచి బాధ్యత సంగతి కొచ్చినా— నేను చెప్పేకన్నా పాఠకులు, మరోసారి అదేసంచికలోని శ్రీ చంద్రశేఖర్ 'బంగ్లాదేశ్'కథ చదివితేచాలు, మనం ఎంత అమాయకంగా బంగ్లాదేశ్‌గురించి శోకిస్తున్నామో అర్థమవుతుంది.

అలాగే ఏడవ బియానల్ పారిస్‌కి ఓ తెలుగువాడి పెయింటింగ్ సెలక్ట్ అయినందుకూ, ఢిల్లీపత్రికలు మరెవర్నో ఆకాశానికెత్తేస్తూ పొగిడినందుకూ మనం చేయెత్తి జేకొట్టు తెలుగోడా అంటూ చిందులువేయనక్కర్లేదు బ్రజిల్ బయానల్ గురించి ఇంతకు ముందే చెప్పాను, ఇహ ఢిల్లీపత్రికల పొగడ్తల విలువెంతంటారా? ఆమధ్య ఓ యువచిత్రకారుడినిగురించి రాస్తూ నా సంపాదకత్వాన వెలువడుతున్న 'కళ'సంపాదకుడుగా అతన్ని పరిచయంచేసి ఘనంగా పొగిడేశారు. అయ్యా అదీ సంగతి.

ఈ మాత్రానికి మనం పొంగి పోనక్కర్లేదు

కనుక...

మనం ఏదన్నా రాసేటప్పుడూ, దేనిని గురించయినా అంచనాలు వేసేటప్పుడూ కాస్త జాగ్రత్తగా ఉండటం- ముఖ్యంగా మనల్నింకా అంటిపెట్టుకునేఉన్న మధ్యతరగతి మేధావి మనస్తత్వాన్ని ముందుగా వదిలించుకోవటం చాలా అవసరమూ, తక్షణ కర్తవ్యమూనూ.

అది సాధ్యంగాదనుకున్నపుడు వర్గపోరాటం, సామాజిక లక్ష్యంలాంటి పదజాలం జోలికిపోకుండా ఉండటం ఉత్తమం.

- చలసాని ప్రసాదరావు

ఆధునిక సాహిత్య చరిత్ర–4.

# అభ్యుదయ కవిత్వం-1

అద్దేపల్లి రామమోహనరావు.

నన్నయనుండి ఈ నాటిదాకా వస్తున్న తెలుగు సాహిత్యాన్ని స్థూలంగా విభజిస్తే రెండే భాగాలౌతుంది. నన్నయతో మొదలైన భాగమొకటి. శ్రీశ్రీ తో మొదలైన భాగం ఒకటి. శ్రీశ్రీ బీజాలు నాటిన అభ్యుదయ కవితోద్యమంతో అంతవరకూవున్న సాహిత్యంతో దాదాపు సంపూర్ణమైన విడాకులిచ్చినంత మార్పు వచ్చింది. కవితా దృక్పథంలోనే కొత్తమలుపు వచ్చింది. గురజాడకీ, భావకవిత్వానికీ, ఈ పరిణామంలో కొంత చారిత్రక ప్రాధాన్యమున్నప్పటికీ, అభ్యుదయోద్యమం సాంప్రదాయిక మార్గం నుండి చీలిపోయిన కొత్తబాట. అందుకనే "మార్పు" అనేది ఆ రోజుల్లో ఒక గొప్ప Concept అంది. మార్పుని సహించేవాళ్లూ, సహించనివాళ్ళూ అని సాహిత్యజ్ఞులు రెండురకాలుగా చీలారు. శ్రీశ్రీతో మొదలై, ప్రతి అభ్యుదయకవీ, ఈ'మార్పు' అనే Concept ని చేతనైనంతగా కీర్తించారు: శ్రీశ్రీ అంటాడు

"భూతకాలపు సరీసృపాలని పాతరాతియుగంలో పాతెయ్
విటారుగా విలబడునేస్తం! హుటాహుటిగా ముందుకు సాగు!
హుషారుగా ముందుకిసాగు! ఊరికే వెనక్కి చూస్తావేం?
దుప్పివీ, కుక్కవీకావు; తిర్యగ్జంతువి నువ్వుకావు
దూరం కరిగిపోతోంది: కాలం మరిగి పోతోంది
మానవుడిగా మేలుకో నేస్తం!
విలుకో ఈ విశ్వం సమస్తం! "

విన్న అంటే అంత అసహ్యం శ్రీశ్రీకి, అతని గుండె నేటితో కొట్టుకుంటుంది: అతని నాడి రేపులో స్పందిస్తుంది,

అభ్యుదయ కవిత్వపు'మార్పు'యొక్క మొదటితరంగం సంప్రదాయవిధ్వంసన. సమాజంలోనూ సాహిత్యంలోనూ పూర్వంనించివస్తున్న మార్గాలన్నిటిమీదా తిరుగుబాటు ఈ ఉద్యమంయొక్క ఆత్మ. తీవ్రమైన సంప్రదాయ విధ్వంసనభావాన్ని అభ్యుదయ కవులందరూ వ్యక్తీకరించి ఉన్నారు. ఉదాహరణకి పురిపండా అప్పలస్వామి–

"తాత వేసిన పంత / దైవమేలిన సంత
పల్లేరు ప్రాకిందిలే / జిల్లేడు మొలిచిందిలే।
రాజు కట్టిన కోట / రాణి మెట్టిన తోట
భూతాలు గెంతాయిలే / బొమికలే నిండాయిలే."

అట్లాగే రామదాసు—

"మానవ మేధస్సుకు తగిలించిన
గత సాంఘిక శిలాశాసనం పడగొట్టను
పగిలిన నా విప్పల కంఠం...."

అప్పటికి సమానతాభావం బాగా వ్యాప్తిపొందుతూఉండటం. ఆంగ్లవిద్య బాగా ప్రచారం లోకిరావడం- కారణాలవల్ల పూర్వ సంప్రదాయాలు, కుల మతాదిభావాలూ, వ్యవస్థని పెరగనివ్వకుండా. ఉక్కుసంకెళ్లగా తయారవుతున్నయ్యని అందరికీ అర్థమౌతోంది. ఈ పరిస్థితుల్లోనుండి తీవ్రమైన హేతువాదం వ్యాప్తమైంది. హేతువాదం యొక్క చరమలక్ష్యం అద్వితీయమైన మానవశక్తిని నిరూపించడం; తద్వారా సర్వమానవ సమానత్వాన్ని స్థాపించడం. హేతువాదులకి ముఖ్యంగా కావలసింది ప్రతి వ్యక్తీ ఈ భౌతికజీవితంలో సమానంగా సుఖపడాలి. దేవుడు, దయ్యం, కులం, మతం, సంప్రదాయం, ఆచారాలు, గోచారాలు— మొదలైన విశ్వాసాలవలన మానవ జీవిత సౌఖ్యం నాశనం చెయ్యబడరాదు. సాహిత్యపరంగా ఈభావాల్ని ఉధృతంగా ప్రచారంచేసినవాళ్లు కందుకూరి వీరేశలింగం, త్రిపురనేని రామస్వామిచౌదరి, చలం. కందుకూరి వీరేశలింగం వితంతువుల జీవితాన్ని బాగుచెయ్యాలనే వేదన మూలంగా మూఢవిశ్వాసాలన్నిటినీ ఖండించాడు. త్రిపురనేని రామస్వామిచౌదరి కులభేదంద్వారా ఏర్పడిన అసమానతని గర్హిస్తూ, భౌతిక జీవిత విలువలకి సాటిలేని ప్రతిష్ఠాపనచేశాడు. నాస్తికత్వాన్ని మొదటిసారిగా బలంగా స్థాపించింది ఆయనే. చలం, లింగభేదంద్వారాఏర్పడిన అసమానతని చీల్చి చెండాడినవాడు, అంతేగాక ఆయన సంపూర్ణంగా హృదయవాది. అందువల్ల ఎక్కడ ఎవరిసుఖం ఏపేరిట దోచుకోబడ్డా. దాన్ని ఖండించాడు. అందుకే తన మాటల్ని తానే చాలాచోట్ల వ్యతిరేకించినచోట్లు ఉంటై ఆయనలో. ఎందుకంటే, ఆయనకి తక్షణం సుఖం కావాలి; స్వేచ్ఛ కావాలి. సమాజం మొత్తంమీద అవగాహన కలిగి, వ్యక్తి దుఃఖానికి కారణంవెతికి. పరిష్కారాన్ని కనుగొన్నవాడు కాదు. దాదాపు హేతువాదులందరూ అంతే. వాళ్ల ప్రతివ్యక్తీ సమానంగా సుఖపడాలని వేదనపడ్డవాళ్లే గాని, ఈ అసమానతకి మూలకారణాన్నీ, దాని పరిష్కారాన్నీ ఊహించినవాళ్లుకారు. ఒకచోట పురుషుడు ద్రోహిఅనీ, ఒకచోట ధనవంతులు ద్రోహులనీ, మరొకచోట కులం ద్రోహిఅనీ, విడివిడిగా దూషించినవాళ్లేగాని, సమిష్టిగా వీటన్నిటినీ నాశనంచేసే

మూలకారణం అన్వేషించలేదు. ఇంకా అప్పటికి భారతీయభావన వ్యక్తి సంస్కారాన్నుండి సమాజ సంస్కారంమీదికి మళ్ళకపోవడమే దానికి కారణం. వ్యక్తిలోనుండి సమాజం చీల్చుకొచ్చే సరిహద్దురేఖమీద, సమాజంలోని బాధాజ్వాలలన్నిటికీ మూలమైన దావాగ్ని ఆవిష్కరింపబడ్డచోట, అభ్యుదయ కవిత్వపు ఆత్మ అంకురించడంజరిగింది.

ఆ ఆత్మయే ఆర్థిక సమానతాదృష్టి. 1930 (Hungry Thirties) లలో యీ ఆర్థిక దృష్టి ఏర్పడ్డానికి ప్రబలమైన కారణం ఉంది. అది ప్రపంచమంతా తీవ్రంగా ఏర్పడ్డ ఆర్థిక సంక్షోభం; పెట్టుబడిదారీ విధానంయొక్క వైఫల్యం స్పష్టంగా ప్రపంచానికి వ్యక్తంకావడం; భారతదేశంలో నిరుద్యోగం, దారిద్ర్యంబాగా వ్యాప్తికావడం — వీటివల్ల ఆర్థికదృష్టి అవగాహనకు వచ్చింది. అప్పుడే 1917 లో విప్లవంవల్ల అపూర్వ విజయం సాధించి పెట్టుబడిదారీ విధానపు ఆయువుపట్టు ఛేదించి, ఆర్థిక సమానతా దృష్టితో సుఖశాంతులు సృష్టించుకొన్న రష్యా గొప్ప ఆదర్శంగా ప్రపంచాన్ని ఆకర్షించింది. బీదతనాన్ని నిర్మూలించడానికి రష్యామార్గమే గొప్పమార్గమనీ, సర్వ అసమానతల నిర్మూలనానికీ, ఆర్థిక అసమానత నిర్మూలించడమే సరియైన పద్ధతి అనీ అర్థమైంది. భారతదేశంలో ధరలు విపరీతంగా పెరిగిపోయి, కార్మిక కర్షకులు సంఘాలుగా ఏర్పడి తీవ్రంగా ప్రతిఘటించే పద్ధతికి పూనుకోవడం ప్రారంభమైంది. ప్రపంచ వ్యాప్తంగా ఫాసిజమ్‌మీద తీవ్రమైన ద్వేషం ఏర్పడింది. ఒక జాతిమీద మరొకజాతీ, ఒక వ్యక్తిమీద మరొకవ్యక్తీ, ఎక్కడ ఏవిధంగా దోపిడిచేసినా, దాన్ని తీవ్రంగా ఎదుర్కోవాలనే దృక్పథానికి అపూర్వమైన ప్రచారం ఏర్పడింది. ప్రపంచమంతటా అన్ని భేదాలూనశించి, ఆర్థికదృష్ట్యా రెండే రెండువర్గాలుఏర్పడి, వాటి పరస్పర ప్రతిఘటన ద్వారానే ప్రపంచంలో ఆర్థిక సమానత ఏర్పడుతుందనే విశ్వాసం కలిగింది.

ఇట్లా రెండువర్గాల దృక్పథం ఏర్పడేటప్పటికి ప్రపంచమంతటా ఒక వినూతనమైన సాహిత్యం కావలసిన అవసరం కనిపించింది. ఈ అవగాహనలేని పూర్వ సాహిత్యం అంతా ఒకవిధమైనది; ఈ అవగాహన కలుగగానే పూర్వసాహిత్యంయొక్క వర్గ దృక్పథం తెలిసివచ్చింది. పూర్వసాహిత్యంలో ఎన్నినీతులు, ఎన్నిధర్మాలు, ఎంత శిల్పమూ, ఎంత పాండిత్యమూ— ఉన్నా అదంతా కొన్ని ఉన్నతవర్గాల యథాస్థితినే కాపాడుతూవచ్చి, వారికే ఆనందాన్ని కలిగిస్తున్నై. ఇటువంటి ఉన్నతవర్గాల యథాస్థితి మారాలి— అనేదృష్టి ఎప్పుడు కలిగిందో, అప్పుడు కావలసింది, క్రిందివర్గాల అభివృద్ధికి కావలసిన సాహిత్యమైంది. పూర్వసాహిత్యంలో ప్రజలకి ప్రాధాన్యంలేదు. ఉన్నత వర్గాలకీ, వాళ్ళ ఆనందానికీ, పాండిత్యానికీ, అచంచలమైన మూఢవిశ్వాసాలకీ, కాలానికి మేకుబందీ గావింపబడిన వ్యవస్థాధర్మాలకీ, మాత్రమే సంబంధించిన సాహిత్యం అది. ప్రజలకెప్పుడు ఉన్నతవర్గాల ధర్మాలలో నమ్మకంపోయిందో, అధర్మాన్ని

పోషించే సాహిత్యంమీద గూడా అప్పుడే నమ్మకం నశించింది. సామాన్య ప్రజలు పైకి పోవడానికి, ఆర్థికబాధలు నశించడానికి, పాతుకున్నవ్యవస్థని ఛిన్నాభిన్నం చెయ్యడానికి, అందర్నీ సమానంగా సుఖింపజెయ్యడానికి ఏభావాలుకావాలో వాటినే సాహిత్యం ప్రతిబోధించవలసిన చారిత్రకావసరం కలిగింది. అందుకే దీనికి ప్రజాసాహిత్యం అనే పేరు కలిగింది. సామాన్యప్రజలు అనేది సాహిత్యంలో సరిక్రొత్త Conceptఐంది. ప్రతికవీ-ఈ సామాన్యుణ్ని, అడుగున పడినవాణ్ణి తన కవిత్వానికి ఏకైక నాయకుణ్ని చేసుకున్నాడు. ఉదాహరణకి- కుందుర్తి—

"ఇది నాకవిత్వం— గీత: వినేవాడు నరుడు
చదువూ సంధ్యలురాని రోడ్డుమీద పామరుడు
లేమితల్లి ఒడిలో నిరంతర గాఢనిద్రాపరుడు"

ఈవిధంగా హేతువాదం పూర్వరంగంగా, ఆర్థికదృష్టి ఆత్మగా, అభ్యుదయ కవిత్వం, తనకు ముందున్న సర్వసాహిత్యంమీదా ఎగరేసిన ఎర్రనిజండా ఐంది.

ఇట్లా ప్రపంచవ్యాప్తంగా కలిగిన నూతనసాహిత్య సంచలనానికి బీజాలుకూడా రష్యాలోనే ప్రారంభమైనై. విప్లవానంతరమే Lunachasky, 920 లో కొత్తరకమైన సాహిత్యం ఎట్లా ఉండాలో సూచించాడు.

"He wrote about a need, for a new kind of literature worthy of the new historic epoch brought into being by the october Revolution; a way of writing that would be at once Socialistic and Realistic".

1934 లో మాగ్జింగోర్కీ- First writers Congress లో "Socialist Realism" అనేపదాన్ని నిర్మించి. ఆధునిక సాహిత్యానికి యిదే ఆత్మకావాలి అన్నాడు. ఈపదాన్ని కొందరు "సామాజిక వాస్తవికత" అన్నారు కాని, న్యాయంగా దీన్ని "సామ్యవాద వాస్తవికత" అనాలి. ఎందుకంటే సమాజంలో కనిపించే ప్రతివాస్తవికతా, సామ్యవాదానికి దారితియ్యదు. ధనవంతుల కుటుంబాల్ని, వారిసంపదల్నీ సౌఖ్యాల్నీ ఎంత Realisticగా వర్ణించినా, అది సామ్యవాదానికి అంగంకాదు. అందువల్ల సమాజంలోని ఏవాస్తవికత, సమసమాజ నిర్మాణోద్వేగాన్ని పాఠకునిలో కలిగిస్తుందో అదే సామ్యవాద వాస్తవికత, ఇదే అభ్యుదయ కవిత్వమంతటికీ లక్ష్యమయింది. "కల్పన" సంకలనానికి ముందు రామదాసు చెప్పినమాటల్లో ఈ అర్థాన్ని చూడవచ్చు.

"ఈయుగంలో వ్యక్తి చైతన్యం సాంఘిక చైతన్యంగా విస్తరిల్లింది. వికలమైన సంఘవ్యవస్థ ఫలితంగా శకలాలై చెదిరిన జీవితచిత్రణకు ప్రాధాన్యం కనిపిస్తుంది. ఈ

యుగాన్ని ఆవరించిన ప్రధాన తత్వదృష్టి మార్క్సిజం. నేటి సాంఘిక విషబంధంలో చిక్కిన మానవునికి మార్క్సిజం గొప్ప నిష్కృతి మార్గంగా కనిపించింది''

అభ్యుదయ కవిత్వానిది ప్రధానంగా వర్గదృష్టి. అడుగునపడ్డ వర్గంయొక్క బాధల్నీ గాథల్నీ వర్ణించి, పీడితవర్గాల అభ్యుదయానికి కృషి చెయ్యడం దీని ప్రధాన లక్ష్యం. తనకు ముందుతరంలో ఉధృతంగా లేచిన భావకవిత్వం, మానవ స్వేచ్ఛను గూర్చి ఎంతగా పరితపించినా, పీడితవర్గాల దగ్గరకురాలేదు. వాళ్ళ కలలుగన్న సౌందర్యం, అనుభూతి మొదలైన విషయాలు నిజజీవితంలోఉన్నతవర్గాలకు మానసికానందం కలిగించేవేగాని, సమాజాన్ని ముందుకునడిపేవి కావు. భావకవులంతా గాలిలో ఎగిరిపోతూ కలలుకన్నారు. కాని మనిషి గాలిలోలేడు, గాలిలో ఎగిరిపోతూ కలలుకనలేడు. వాడు గాలిలోకెగిరినా, కలలుకన్నా, అన్నీ ఒకవ్యవస్థా నిర్మాణంయొక్క ఫలితం. ఒక వ్యవస్థలో ఒక ఆర్థిక సామాజిక పరిస్థితియొక్క వలయంలో, ప్రతివ్యక్తియొక్క స్థితి, నీతి మొదలైనవన్నీ ఆధారపడి ఉన్నై. సమాజంలో వ్యక్తియొక్క ఆలోచన సరియైనది గాని, సమాజాన్ని వదిలిపెట్టి ఆకాశానికెగిరిపోయే మనిషి కలలు వ్యర్థమైనవి— అనే సూత్రం అభ్యుదయ యుగానికి నాందియై, భావకవితాయుగానికి భరతవాక్యం పాడింది. అభ్యుదయ యుగ ప్రవర్తకులలో మొదటివరుసలో ఉన్న శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి, ముద్దుకృష్ణ మొదలైన కవులందరిలో ఈ భావకవితా నిరసన స్పష్టంగా కనిపిస్తుంది.

కుక్కపిల్లా / అగ్గిపుల్లా
సబ్బుబిళ్ళా / హీనంగా చూడకు దేన్నీ
కవితామయ మేనోయ్ అన్నీ —

అన్న శ్రీ శ్రీ మాటల్లో, సౌందర్యమయమైన వస్తువులే కవిత్వానికి అర్హమైన దృక్పథానికి వ్యతిరేకమైనవి అనే భావకవులదృష్టి వ్యక్తమౌతోంది. అన్నీ కవితామయమే— అనడంవల్ల కవిత్వానికి వస్తునిర్దేశం అవసరంలేదనీ, శిల్పమొక్కటే ముఖ్యమనీ, చాలా మంది భావించేవిషయం భ్రాంతిమూలకమే. 'ఋక్కులు' అనే గేయంలో శ్రీశ్రీ, ప్రపంచంచేత విస్మృతమైన వస్తువులన్నీ ఇప్పుడు కవిత్వానికి కావాలిఅనే విషయాన్ని ధ్వనింపజేస్తున్నాడు. అందుకే దీన్ని వ్యాఖ్యానిస్తూ చలం "అగ్గిపుల్లవంక- ముఖ్యం పుచ్చిన అగ్గిపుల్లవంక చాలాసేపు చూడమంటాను; కుక్కపిల్లని- ముఖ్యం తల్లిచచ్చిన దిక్కులేని గజ్జికుక్కపిల్లని పెంచమంటాను" అన్నాడు. మొత్తంమీద ప్రపంచంచేత మరిచిపోబడి, కవిత్వానికి పనికిరావనుకున్న వస్తువులన్నీ అభ్యుదయకవికి ఆత్మగా పరిణమించినై. భావకవిత్వంనించి వేరుపడిన తమ మార్గాన్ని విశదీకరిస్తూ శ్రీరంగం నారాయణబాబు "సంఘర్షణ"కావ్యానికి రాసిన "ప్రవర"లో యిట్లా అంటాడు.

"అంతవరకూ భావకవులతోపాటు మేముకూడా జీవితగిరిష్షాన్ని దర్శించేందుభ్యుద మనోనేత్రానికి తగిలించిన 'గాగుల్సు' నేల విసరికొడుదుంగదా! హృదయంలో శోగలుదర్శె పెగలూరేగి వీధికాలువనీటిలో బురదలో ఆపసోపాలుపడిపోతున్న శ్వానాథుడూ, ఊంవస్త్రీ బైట పొలంలో ఇనకిరణాల క్రౌర్యంతో కాయక్లేశపడుతున్న పేద్యగాని శరీరంమీపుడూ పండిస్తున్న ఘర్మమౌక్తికాలతో తాజ్‌మహల్ కట్టాలని బుద్ధిపుట్టింది. మా కవిత్వంలప్పు ఉండకూడని వస్తువు, వాడకూడనిభాషా లేనేలేదు. చాకలాధు, సంతబయలు, కుక్కవి పా గాడిద, కుళ్లకాలవ, ఫేక్టరీకూత, మరఫిరంగి, మందుగుండు, బీదవాడు, భిక్షువామ్య యసి- అవేమిటి, ఇవేమిటి- లోకంలోఉన్నవన్నీ, పలాయనతత్వం పనికిరాదు. స్వర్గంగ మందు విషాపనికిరాదు. జీవితం ఎంత సహారాఎడారిఐనా మేముమాత్రం మరి ఉష్ఠంది. పక్షులమై సంచరించలేము, యథార్థంగా జీవితాన్ని దర్శిస్తాము. జీవితం మాలినవర్గావి భూయిష్ఠంఅని వప్పుకుంటాము. వేలెత్తి చూపిస్తాము. జీవితంలో మాలిన్యాన్నిగాలి క్షాళితం చేస్తాము. వేదాంతులు జీవితాన్ని, ప్రకృతిని, అవగాహన చేసుకు మేము లోకాన్నీ జీవితాన్నీ ప్రకృతినీగూడా మారుస్తాము." (ఈ చివరిరెండు వా సరిగ్గా మార్క్సు మాటలకు ప్రతిధ్వనులు. దీన్ని బట్టి అభ్యుదయకవులు మార్క్సు సిద్ధాంతాలలో తాలచేత ఎంత ప్రభావితమైందీ తెలుస్తుంది) నారాయణబాబు చెప్పిన ఈమాటలో అభ్యు దయ వస్తుతత్వం స్పష్టంగా తెలుస్తుంది.

అభ్యుదయ కవిత మార్క్సిజమ్‌యొక్క ప్రేరణ కలిగింది. అందువల్ల అభ్యు దయకవి మార్క్సిజమ్‌ను గూర్చి బాగా అవగాహన చేసుకోవలసిఉంది. కాని అభ్యుదయ కవితకీ, మార్క్సిజానికీ సంబంధం ఏమిటనే ప్రశ్న కొందరిలో ఉంది. దాని వివరించవలసి ఉంది. మార్క్సిజమ్‌అనేది ఒక రాజకీయభావంతో ఆగిపోయేదికాదు దానివెనక ఒక సంపూర్ణమైన తాత్త్వక అవగాహనఉంది. ఈ సృష్టి ప్రారంభంమొదలు కొని ప్రపంచాన్ని తయారుచెయ్యవలసిన విధానందాకా, ఒక అచంచలమైన ప్రణాళి ఉంది. సాహిత్యంలో, పరిపూర్ణమైన తాత్విక ప్రణాళికగలిగినవి రెండే ఉన్నై మొదటిది, పుణ్యం, పాపం, స్వర్గం, నరకం, వర్ణవ్యవస్థమొదలైన విశ్వాసాలమీ ఆధారపడిన సమాజాన్ని నిరూపించే పూర్వసాహిత్యం. ఆ విశ్వాసాలన్నిటినీ హేతు బద్ధంగా ఖండిస్తూ, మరొక వినూతన సమసమాజాన్ని నిరూపించే సామ్యవాద సాహి త్యం రెండవది, పూర్వసాహిత్యానికిగల తాత్త్వక ప్రణాళిక ఎంతబలమైనదో, నవ సాహిత్యానికిగల ఈ ప్రణాళికగూడా అంత బలమైనది. అందువలన పూర్వవ్యవస్థ తిరస్కరిస్తూ, పూర్వసాహిత్యాన్ని నిరసిస్తూ బయలుదేరిన నవ్యసాహిత్యానికి, ప్రగాఢ మైన తాత్త్వక పూర్వరంగం అవసరం. ఆ రంగాన్ని మార్క్సిజమ్ అందించింది సర్వాంశాలలో పూర్వదృష్టిని ఖండిస్తూ, నవ్యదృష్టిని నాటుకొనేటట్లు చెయ్యగలిగిందది

దుభ్యుదయ కవిత్వంలోని. పీడితులబాధలు. ధనవంతుల దౌర్జన్యాలు. కులమతాల కుష్ల
గలుదలైన అంశాలన్నీ విడివిడిగా మార్క్సిజమ్‌తో సంబంధంలేనివిగా కనిపిస్తున్నా,
ఉంవన్నీ లేకుండాచేసే నూతన సమాజనిర్మాణ భావానికి సామ్యవాదం రాకపూర్వం
ంమీవుడూ, కులమూ, మతమూ. మొదలైన విశ్వాసాల్నీ భౌతికవాదులు కూడా ఖండించ
ంలేదు. కాని. వారిదృష్టి యధార్థదృష్టిమాత్రమే. నిజాన్ని స్థాపించడమే వారిధ్యేయం.
క్కాని సామాజికాభివృద్ధిలో వాటిపాత్రకి సమాధానం కేవల భౌతికవాదులదగ్గర ఉండదు.
సామ్యవాదమే దానికి సమాధానం చెప్పగలదు. సామ్యవాదానిది రెండువర్గాల దృష్టి.
ంగా ఒకవర్గం. మరొకవర్గాన్ని దోపిడిచేసి, సాంఘికంగా అసమానతని సృష్టి
ంది. ఉన్నతవర్గంయొక్క దోపిడిలోను, సమాజాన్ని మార్చకుండా ఉంచడంలోనూ.
వర్గానికి దేవుడు, కులం. మతం మొదలైనవి ఉపయోగపడతై- సమాజాన్ని మార్చి
నత సృష్టించాలంటే. ఆ విశ్వాసాలన్నీ నశించిపోవాలి. ఈవిధంగా ఆ విశ్వాసాల
సామాజికస్థితిని, సామ్యవాదం స్పష్టంగా చూపిస్తుంది. ఇట్లాగే, ఆధునిక,
య భావాలనబడే సర్వభావాలయొక్క తాత్త్వికావగాహన, నిష్కృతి, మార్క్సి
లో దొరుకుతుంది అందువల్ల అభ్యుదయ కవిత్వానికి మార్క్సిజమ్ అనేది ఒక
తమైన తాత్త్వికదృక్పథం ఐంది. ప్రతి అభ్యుదయ రచనలోనూ మార్క్సిజమ్
ష్టంగా కనిపించకపోవచ్చు: మొత్తంమీద ఉద్యమంగా తీసుకున్నప్పుడు, అభ్యుదయ
వాలన్నిటి యొక్క అస్తిత్వమూ, మార్క్సిజమ్ దృక్పథంలోనే సరిగా ఋజువుకాగ
దు. అందుకే మార్క్సిజమ్ యొక్క అవగాహన బాగా కలిగినవాడు, తన రచనల
ండా ఒకనిర్దిష్టమైన అభ్యుదయ దృక్పథాన్ని నిరూపించగలడు. అందుకే ఒకచోట
దవటిగంటి కుటుంబరావుగారు, అభ్యుదయ రచననీ, అభ్యుదయ కవినీ. విడివిడిగా
చూడాలంటారు. అభ్యుదయ రచనచేసిన ప్రతికవీ అభ్యుదయ కవికాడు:

అభ్యుదయ సాహిత్యం. అంతకుపూర్వమున్న సాహిత్య దృక్పథాన్నే పూర్తిగా
మార్చేసింది. ముఖ్యంగా సాహిత్యవిమర్శకి మూలగ్రంథంగా ఉన్న అలంకారశాస్త్రానికి
బడిపోయింది. అలంకార శాస్త్రంలోని నాయికానాయకభేదాలు, రసభేదాలూ- అన్నీ
న్నవర్గాలయొక్క ప్రతిబింబమే అన్నది స్పష్టంగా తెలిసింది. అంతేగాక విభావాను
వ వ్యభిచారీ భావసంయోగాద్రస నిష్పత్తిఃగూడా. సంపూర్ణ సుఖమయ సమాజజీవన
తిబింబమే. ఎగుడుదిగుడు సమాజానికీ ఆరసానికీ సంబంధంలేదు. ఇంకా ఆశ్చర్యం
మిటంటే. రసాన్ని అనుభవించే మార్గంగూడా అలంకార శాస్త్రప్రకారం ఒకవ్యవస్థా
ర్మాణాన్నే సమర్థిస్తుంది. పూర్వజన్మనుండి వచ్చిన వాసనలే మనలో ప్రేరేపింప
ది రసానుభూతిని కల్గిస్తైయని ఆశాస్త్రం చెప్తుంది. జన్మపరంపరని నమ్మనివారికి

శాస్త్రంలో సమాధానం లేదు. అందువల్ల అలంకారశాస్త్రమంతా ప్రాచీన వ్యవస్థకేవిలువలకి సంబంధించిందని అభ్యుదయ యుగంలో బాగాబుజువైంది. సంఘంయొక్క యథాస్థితికి బావించరాద శాస్త్రం దోహదమౌతుంది గాని, సంఘం యొక్క మార్పుకి అది ఉపయోగించదు; పరి అభ్యుదయ కవికి ఈ సంఘాన్ని మార్చడమే ప్రధాన లక్ష్యం. అలంకారశాస్త్రం విలువల్నిగు అనుభూతి విశ్లేషణని అనంతముఖాలుగాచేసింది. ధ్వనినీ, అలంకారాల్నీ లక్షవిధాలుగ చర్చించింది. ఏ అనుభూతికొరకు ఎట్లారాయాలి అనేదే దానిధ్యేయం; దేన్నిగురించి రాయాలి అన్నది దానికి సంబంధంలేదు. రసానందంలోని లోతులే దానికికావాలి. ర విహీన ప్రపంచానికి ఏ ప్రయోజనం సాధించాలి అన్నది దానికి అక్కర్లేదు. ప్రప చాన్ని మార్చడం అనేది కవికెప్పుడు ప్రధానమైందో, ఆమార్పుకి ఉపకరించని శాస్త్ర లన్నీ బాహ్య విషయాలైపోయినై. ప్రపంచం మార్చాలంటే కవి, కొన్ని తీవ్రమై భావాల్ని ప్రకటించాలి. అందువల్ల భావాలకే ఈకవిత్వంలో ఉన్నతస్థానం. ఆభావాల్ని ఎంత అందంగా చెప్పాలి అనేశిల్పంతో ప్రమేయంలేదు. అందువల్ల వస్తుదృష్టి ప్రధ నమూ, శిల్పదృష్టి అప్రధానమూ ఐంది. ఐతే, భావాన్ని తీవ్రంగా వెలువరించడానికి అవసరమైనంత శిల్పదృష్టి ఉండనే ఉన్నది. కేవలవస్తువే, శిల్పచాతుర్యం లేనిదే తీవ్రతపొందదు. వస్తుదృష్టిని నశింపచెయ్యని శిల్పదృష్టియే అభ్యుదయకవు లంగీ రించారుగాని, కేవలశిల్పాన్ని తిరస్కరించారు.

అభ్యుదయ కవిత్వం సాహిత్యం యొక్క సార్వకాలీనత, సార్వజనీనత- అ దృక్పథంమీద తిరుగులేని దెబ్బకొట్టింది. సమకాలీనత- అనే నూతన దృక్పథాన్ని అచంచలంగా స్థాపించింది. పూర్వసాహిత్య ప్రియులందరికీ త్రికాలాబాధిత సాహిత్యం మీదా, కవి మరణించినా కావ్యం శాశ్వతంగా నిలవడంమీదా, విశ్వాసం ఎక్కువ. కాని, ప్రజలయొక్క భావాల్లోనూ, జీవన సిద్ధాంతాల్లోనూ, వ్యవస్థానిర్మాణంలోను మార్పు వచ్చినప్పుడు, సాహిత్యానుభూతిలో విపరీతమైన మార్పువస్తుందనేది, వార గమనించరు. కాని అభ్యుదయ కవిత్వం వ్యవస్థనుబట్టి, సాంఘిక ప్రయోజనాన్నిబ కవిత్వం మారిపోవచ్చుననీ, లేదా మారిపోవాలనీ ప్రబోధిస్తుంది. అందువల్ల శాశ్వ మైన కొన్నివిలువల్ని అది అంగీకరించదు సమకాలీన సమస్యల్ని చైతన్యయుతంగా నిరూపిస్తే చాలు; తనకాలాన్ని బాగుచేసుకునే పరిష్కారమార్గాల్ని చూపిస్తే చాలు సాహిత్య ప్రయోజనం నెరవేరినట్లే. శ్రీశ్రీ ఒకచోట తిలక్‌నిగూర్చి చెప్పినట్లుగా–

"సమకాలిక సమస్యలకు
స్వచ్ఛస్ఫాటిక ఫలకం"

లాగా కవిమారాలి. పదాల్లోని శక్తిగాని, శైలిలోని పద్ధతిగాని, వస్తువుగాని. కవిత్వ విలువలుగాని, మార్పుపొందేవేగాని, "బ్రిహ్మపదార్థాలు" గావు. ఐతే, కవిత్వ

కవిలువలకి ఏమాత్రం స్థానంలేకుండా- కేవల వస్తువాక్కుచే కవిత్వమైపోయిందని భావించరాదు. నిజానికి కవిత్వపు విలువలులేనిదే ఏవస్తువూ ఉత్తమకవిత్వంగా రూపొందదు: పఠిత హృదయాన్ని స్పందింపజెయ్యదు. అభ్యుదయ కవిత్వంలోని కవిత్వ విలువల్నిగూర్చి మరొకచోట చర్చిస్తాను.

కేవల భావవాహికగా కవిత్వం మారడమనేది అభ్యుదయ కవిత్వంలో వచ్చిన మార్పు. కేవలం భావవాహికగా ఎప్పుడుమారిందో, అప్పుడే ఛందస్సు విషయంలో తీవ్రమైన వైవిధ్యం రావడం ఆరంభించింది. భావకవితాయుగంలో లయబద్ధ గేయం దాకా వచ్చిన కవిత్వం, ఈయుగంలో లయదృష్టినిగూడా క్రమంగా వదిలేసింది. లయలేని జీవితాన్ని వర్ణించేకవిత్వం కనుక, దీనికి లయయొక్క అవశ్యకత కనిపించలేదు. లయబద్ధ గేయాలూ, లయలేని గేయాలూ, వచన గేయాలూ, ఇంకా అనేకవిధమైన ప్రయోగాలు ఈ అభ్యుదయయుగంలో జరిగినై. చివరికి అభ్యుదయ భావానికి వచన గేయం స్థిరపడిపోయింది. కేవల వస్తువృష్టియొక్క చరమఫలితం ఈ వచనగేయం.

ప్రాచీనకవికి పండితులే శ్రోతలు. కాని అభ్యుదయకవి సంఘాన్ని మార్చదలచినవాడు కనుక ప్రజలంతా అతనికి శ్రోతలు. పండితులు పూర్వవ్యవస్థయొక్క యథాస్థితికి రక్షకభటులు. ప్రజలు మార్పుకి అభిముఖంగా ఉంటారు. అందువల్ల అభ్యుదయకవికి ప్రజలు శ్రోతలయ్యారు. ప్రజలకి అర్థమయ్యేటట్లు చెప్పవలసిన అవసరం అతనికి కలిగింది. వ్యాకరణం లేనివారిజీవితాల్ని వర్ణించడానికి వ్యాకరణాన్ని వదిలిపెట్టవలసివచ్చింది, ఛందస్సులేనివారి బాధల్నిచెప్పడానికి ఛందస్సు వదిలిపెట్టవలసివచ్చింది. లయరహితమైన భావాల్నీ, వ్యావహారిక భాషనీ స్వీకరించడంలో, వచనగేయమే పరిణతరూపంగా నిలిచింది. ఈ పరిణామాన్ని గూర్చి మరొకచోట వివరిస్తాను.

మొత్తంమీద అభ్యుదయ కవిత్వానికి సమాజం రక్తమాంసాలు, పీడితవర్గం గుండెకాయ, పోరాటం ప్రాణవాయువు. ఈ కవిత్వం, 1934 నుండి 1944 దాకా ఒక దశాబ్దంగానూ, 1944 నుండి 1954 దాకా మరొక దశాబ్దంగానూ, రెండుదశల్లో విజృంభించింది. ఈ విషయాల్ని మరొక వ్యాసంలో వివరిస్తాను.

సాహిత్య లేఖ

# ప్రత్యేక తెలంగాణ

'సృజన' ఏప్రిల్ 71 సంచికలో 'స్వాధీన్ బంగ్లాదేశ్' కవిత చదివాను. అందులో తెలంగాణా గురించికూడా వ్రాశారు.

తెలంగాణా అభివృద్ధిలోను, ఉద్యోగావకాశాలలోను అన్యాయం జరిగి ప్రజలలో ఉన్న అసంతృప్తి ఉద్యమరూపం ధరించింది. దానికి దోపిడీవర్గాలే నాయకత్వంవహించి గుడ్డి ఆంధ్రద్వేషం రగిల్చి ప్రత్యేకరాష్ట్రమే (మంత్రి పదవుల పంపకానికి!) పరిష్కార మార్గంగాచూపి ఆ ఉద్యమాన్ని పక్కదారులు పట్టించారు.

లోగడ శ్రీ రా. వి. శాస్త్రిగారు ఆంధ్రజ్యోతి వీక్లీ (తేదీ గుర్తులేదు) లో తెలంగాణపై ఒకలేఖ రాశారు. అందులో పల్లకీమోసే బోయీలకి పల్లకిలో వర్మగారున్నా శర్మగారున్నా ఒకే రకంగానే బరువుమోయవలసి ఉంటుందని ... తెలుపుతూ ప్రత్యేక తెలంగాణా వచ్చినంతమాత్రాన్నే దోపిడీ అంతంకాదని రాశారు.

మొన్నరాసిన 'ఓ ఆంక్ష ఓ అరెస్టూ' లో కూడ తెలంగాణా ఉద్యమంలో పెద్దలుచేసినది వర్గద్రోహంకాదు కాబట్టి రాజద్రోహంకాదని రా. వి. శాస్త్రిగారన్నారు.

కలం వీరయ్యగారు 'స్వాధీన్ బంగ్లాదేశ్' కవితలో "నా తెలంగాణా దోపిడీ దొంగలు పన్నిన భాషా సాలెగూడును చీల్చినందుకే శభాష్" అన్నానంటున్నారు. తెలంగాణాలో ఉద్యమం అన్నిరకాల భాషల దోపిడీ వర్గాలన్నిటికి వ్యతిరేకమైనదైతే ఆ దోపిడీవర్గాలే దానికి నాయకత్వం ఎల్లా వహించగలుగుతాయి? ఇంకేదో పత్రికలో కొందరభిప్రాయపడినట్టు అందులో లెనిన్ ఎల్లాఉంటాడు? తెలంగాణా ప్రత్యేకరాష్ట్రం వస్తే దోపిడీ అంతమవుతుందా? ముల్కీ నిబంధనలతో నిరుద్యోగం రూపుమాసి పోతుందా?

ఈ కవితలోనే "ఎవడు జోస్యం చెప్పగలడు రేపు పదికోట్లప్రజల వీరబెంగాల్ ఏర్పడి బ్రిటిషు కుతంత్రం చీల్చిన దేశం ఒకటికాదని" అని అడుగుతున్నారు. అంటే తెలంగాణా....భాష ఒకటైనా విడిపోవాలి. భాష ఒకటేకాబట్టి ఏడున్నరకోట్ల స్వాధీన్ బంగ్లాతో మిగిలిన బెంగాలీలు కలసి వీరబెంగాల్ ఏర్పడాలి వీరిదృష్టిలో!

మార్క్సిస్టుల దృక్పథంలో ఇటువంటి భేదాభిప్రాయాలకు కారణమేమిటి? సంపాదకులు ముఖపత్రం మీదకూడ వేసి ప్రచురించారు కనుక వీరుగాని, రచయితగాని పత్రికాముఖంగా దీనినిగురించి వివరించగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు,
ఒక పాఠకుడు
(విశాఖపట్నం)

NA Telugu Monthly December '71 Regd. No. H-1088




కొడవటిగంటి కుటుంబరావు

"కుటుంబరావుగారి వ్యాసాలు ప్రకటించి నిజంగా ఉపకారం చేసారు. చదువుతూంటే మనస్సులోని మసక కొంచెం కొంచెం ఒత్తిగిల్లి తున్నట్లు అనిపిస్తున్నది...."

— కె. వి. రమణా

ప్రతులకు:

సృజన
ప్రచురణ

వెం : 1